Approved by the Text Book Committee, Madras.
Vide Fort St. George Gazette dated 10-5-38 Page 261.

శ్రీ

# సావిత్రీ నాటకము



శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి

:—సోమరాజు రామానుజరావుగారు.)

డగు కాలకేతనుఁడు మహాభయంకర స్వరూ
త్యాదాహముచే పరికృతిభీకరుఁడై - యొనరించిన
లు. కాలకేతునివంటి భయంకరవ్యక్తి మన
నింతకు మున్ను చిత్రింపఁబడి యుండలేదు.
చిన్నభార్య మంగళ దుర్బోధనలు తలకెక్కి
ధ్వియు నగు సులోచనను, ఘోరముగ వధించి
డైన భృత్యుఁడగు ఆగభాషిప్రాణములు తీసి
న, ఘోరాగ్రేసరుఁడగు మృగేశునియొక్కయు -
లకంఠునియొక్కయు మోసము బహిర్గతమై,
పశ్చాత్తాపమున నీలకంఠమృగేశుల శిక్షించి
నాంతమగు విచిత్రకథావిధానము. ఇందలి నాం
కథావృక్షమునకు బీజము. వీఁడు తాగుబోతు.
ఘూటాకోరు — సకల దుర్లక్షణాలంకారుఁడు.
నుంచుకొని, నీలకంఠుఁడు కాలకేతుని సింహాస
విశ్వప్రయత్నములు చేసి భంగపడినాఁడు. ఇం
ంతకము స్నేయాంధ్రనాటకమునందును చూచి
నుఁడు, ఆగభాషీ సులోచనలను వధించిన భయం
ఘట్టము చదువుచున్నవు డెట్టిదృఢచిత్తులకై
లింపక మానవు. ఆ కాళరాత్రియందు నడచిన
విద్రోహ, భయానక, విషాద, విషయము
మును ధరించి, నిరంతరము పాఠకులకన్నుల గట్టి
నామాక్షరములు పాఠకులకు భయప్రదములై
వెల రు. 1—0—0.

సూరి సుబ్బారావు అండ్ సన్స్,

**Approved by The Text Book Committee, Madras.**
**Vide Fort St. George Gazette, dated 10—5—38—Page 261.**

శ్రీ సావిత్రీ గ్రంథమండలి — ప్రథమ ప్రచురణము

శ్రీ

# సావిత్రీ నాటకము

గ్రంథకర్త:

శ్రీ రాముల సచ్చిదానందశాస్త్రి.

ఏడవకూర్పు: 1000 ప్రతులు.



ప్రకాశకులు:

శ్రీ సావిత్రీ గ్రంథమండలి,
బెజవాడ.

ముద్రాపకులు:
ఆంధ్రవాణీ ముద్రాక్షరశాల బెజవాడ.

1938



[వెల రు. 1-0-0.

# పాత్రములు.

## పురుషులు

1. సత్యవంతుఁడు—[సాళ్వరాజపుత్త్రుఁడు, కథానాయకుఁడు]
2. శారద్వతుఁడు
3. వసంతుఁడు
4. వీరవ్రతుఁడు

(2–4) [సత్యవంతుని మిత్రు లగు మునిబాలురు]

5. అశ్వపతి—[మద్రదేశపురాజు]
6. నారదుఁడు.
7. ద్యుమత్సేనుఁడు—[కథానాయకునితండ్రి]
8. విష్ణుశర్మ—[బీద బ్రాహ్మణుఁడు]
9. రామశాస్త్రి—[బ్రాహ్మణుఁడు]
10. పురోహితుఁడు.
11. యముఁడు.
12. యమభటుఁడు.

## స్త్రీలు

1. సావిత్రి—[మద్రదేశపురాజు కూఁతురు, కథానాయిక]
2. మాళవి—[సావిత్రి తల్లి]
3. శైబి—[సత్యవంతుని తల్లి]
4. మల్లిక—[విష్ణుశర్మభార్య, కఠినస్వభావ యగు దుష్టకాంత]
5. వాసంతిక
6. శ్యామల

(5–6) [సావిత్రి సఖులు]

7. సావిత్రీదేవి.

పరిచారకలు మొదలగువారు.

# కృతిసమర్పణము



ఉ॥ మైలవరాధినేత, జనమాన్యుఁడు, శాంతుఁడు, బాలభారతీ
పాలనతత్పరుండు, శ్రితవత్సలుఁ, డార్యనుతిప్రపూర్ణది
గ్జాలుఁడు, శూరనేనికులచంద్రుఁడు, వేంకటపాపరాయ భూ
పాలుఁడు, మత్కృతీశ్వరుఁడు వర్ధిలుఁగాత యశోవిశాలుఁడై.

# పీఠిక.

శ్లో॥ "మందః కవియశఃప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతాం,
ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః."

అని కవికులగురు వగు కాళిదాసుఁడే వచించినప్పు డితరుల సంగతి నడుగవలయునా? అందును మహామహులకుఁ గూడ నసాధ్యమగు నాటకరచనకు నావంటివాఁడు గడంగుట సాహసము కాకమానదు.

నే నీ నాటకము ఇరువది సంవత్సరములకుఁ బూర్వము శ్రీ బాలభారతీసమాజపోషకులును, మైలవరపురాధీశ్వరులునగు శ్రీ శ్రీ శ్రీ సూరానేని వేంకట పాపయ్యారావు బహద్దర్ జమీందారుగారి యా దరమున వ్రాసితిని. వెంటనే దానిని శ్రీ జమీందారుగారు తమ సంఘమునఁ బ్రదర్శింపఁ జేసిరి. తరువాతఁ గొన్ని మార్పులతో శ్రీ సీతారామాంజనేయనాటకసమాజ పోషకులగు శ్రీ శ్రీ శ్రీ మోతే నారాయణరావు జమీందారుగారి యాదరమున వారిసంఘమునఁగూడఁ బ్రదర్శింపఁబడినది. ఈ ప్రదర్శనములవలన నే ననుకొననంతటి యామో దమును బొందఁగలిగితిని. ఇట్టి యానందమును గలుగఁజేసిన శ్రీ సూరా నేని వేంకటపాపయ్యారావు బహద్దర్ జమీందారుగారికిని, శ్రీ మోతే నారాయణరావు జమీందారుగారికిని నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈ నాటకమును మొదట ముద్రించుటకుఁ దగిన ప్రోత్సాహ మొనర్చి తమ యభిప్రాయ మొసంగిన నర్సాపురం సబ్ జడ్జిగారగు మ॥ రా॥ శ్రీ పాలూరి రామారావు పంతులు, బి. ఏ., బి. ఎల్., గారికిని, ప్రథమముద్రణమునకు సహాయముచేసి మహోపకార మొనరించిన నర్సాపురనివాసులును మహోదారస్వభావులును వదాన్యశిరోమణులు నగు మ॥ రా॥ శ్రీ ఎర్రమిల్లి నారాయణమూర్తి పంతులు, బి. ఏ., బి. ఎల్., హైకోర్టు వకీలు గారికిని, ద్వితీయ ముద్రణమునకు సహాయ మొనరించిన శ్రీ మోతే నారాయణరావు జమీందారుగారికిని, తృతీయముద్రణమునకుఁ బ్రోత్సహించిన మ॥ రా॥ శ్రీ సర్ మొహియుద్దీన్ యార్జంగు బహద్దరు సుబేదారు [ఓరంగల్లునం దుండెడి హంటరు] సాహెబుగారికిని, తృతీయ ముద్ర

ణమునకు ధనసహాయ మొనరించిన నైజాంయిలాకా గోదావరీతీర మందున్న భీమవరము కాపురస్థులగు మ॥ రా॥ శ్రీ చిత్తూరు మక్తాదారు నరహరి నరసయ్యరెడ్డిగారికిని, చతుర్థ ముద్రిణమునకు ద్రివ్యసహాయముచేసిన గుంటూరు శ్రీ బాలమిత్రిసభాధ్యక్షులగు బ్రిహ్మశ్రీ దంటు వేంకటకృష్ణయ్యగారికిని, నైదవముద్రిణమునకు సాయముజేసిన బ్రిహ్మశ్రీ బాకురుపండ వేంకటరమణమూర్తిగారికిని నే నెతయుఁ గృతజ్ఞుఁడను.

పుస్తకముపై నభిప్రాయము నొసంగిన పండితవర్యులకును, నా నాటకమును బరిశీలించి శిష్యవాత్సల్యమును బఱపిన మహాపండితులగు బ్రిహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రి శతావధానిగారికిని నే నెంతయుఁ గృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాఁడను.

ఈ నాటకమం దనేకలోపము లుండియుండును. చర్చించి సహృదయ హృదయానుసారముగ మఱియొక ముద్రిణమున సవరించు కొనఁ బ్రాజ్ఞుల ననుజ్ఞ వేఁడుచున్నాఁడను.

నా పుస్తకములను, సుప్రసిద్ధు లగు నితర పండిత కవుల గ్రింథములను బ్రికటింపఁ దలఁచి "సావిత్రి గ్రింథమండలి"ని స్థాపించి ప్రిథమసంపుటముగా నీ సావిత్రి నాటకమును బ్రికటించితిని. వెంట వెంటనే గ్రింథములు వెలువడఁగలవు. మహారాజులు, రసికులు, ధనికులు, పండితులు నాయుద్యమమునకుఁ దోడ్పడఁ బ్రార్థితులు.

బెజవాడ,
30—10—38.

ఇట్లు బుధవిధేయుఁడు,
శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిం.



శ్రీ ర స్తు.

# సావిత్రీ నాటకము

## నాంది.

చ॥ తన గురుముఖ్యులెల్ల జడదారినిఁ గోరఁగరా దఁటన్నఁ, గా
దనఘుఁడు రాజమౌళి యని, యాతని నెమ్మి వరించి, వానికై
యనితరసాధ్యమై వెలయునట్టి దృఢవ్రత మూని సౌఖ్యముల్
గనిన మహీధరాత్మజ యఖండసుఖంబులు మీ కొసంగుతన్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి పుష్పాంజలిం జల్లి సభఁ గలయంజూచి సంతసముతో]

సూత్ర—విద్వజ్జన విభూషితంబై రసికవరపరీవృతంబై మహీనాథసనాథంబై యీ సభ యెంత యామోదజనక మగుచున్నది! ఇమ్మహాశయుల నానందింపఁ జేసినప్పుడుగదా, నేను ధన్యుఁడనగుట. [చూచుట నభినయించి] అదిగో! ప్రేయసి వచ్చుచున్నది. విచారించి కర్తవ్యము నిశ్చయించెద.

నటి—[ప్రవేశించి] ఆర్యపుత్త్రా! నమస్కారము.

సూత్ర—అభీష్టావాప్తి రస్తు.

నటి—ఆర్యా! సభ్యులు నాటకావలోకనకుతూహలమును వెలిఁబుచ్చుచున్నవారు. ప్రదర్శనమునకై యనుజ్ఞ వేఁడెద.

సూత్ర—కల్యాణీ! ఏ రూపకాభినయమ్మున నిమ్మహామహుల సంతుష్టిఁ బఱుపఁగలము?

నటి—ప్రభుగౌరవమునఁ గవితవోలె భవదనురాగాతిశయమున నలరారఁదగిన నేనా, మీకుఁ గర్తవ్య ముపదేశించుదానను?

సూత్ర—అట్లనఁ బోకుము. సత్కృతులచే నరపతులువోలె, నుత్తమ సతులవలననే భర్తలు శాశ్వతకీర్తిని గడింతురు.

నటి—ఇది పరిహాసమా ?

సూత్రి—పరిహాసముకాదు; ముమ్మాటి కిదియే నిశ్చయము.

నటి—అట్లయిన నట్టియుత్తమసతీచరిత్రి మెద్దియైన నాటక రూపమున మున్న, దాని బ్రదర్శింపఁ జేయఁగోరెద.

సూత్రి—కలదు. అట్టి రూపకమే కలదు.

నటి—[సంతసముతో] నిజముగానా ?

సూత్రి—నిశ్చయముగ.

నటి—అయిన దాని నామ మేమి?

సూత్రి—సావిత్రి.

నటి—ఆహా! ఈమె చరిత్రి మతిపవిత్రము కదా! మహాభారతమున సంగ్రిహముగనున్న యీకథను నాటకరూపమున వ్రాసి స్త్రీల కృతజ్ఞతకుఁ బాతుఁడైన యా సుకవి యెవ్వరో ?

సూత్రి—శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి.

నటి—[స్మృతి నభినయించి] బెజవాడ హిందూ హైస్కూలునందు పండితపదవినుండిన శ్రీతిరుపతి వేంకటేశ్వరకవీశ్వరులశిష్యుఁడా!

సూత్రి—ఔను.

నటి—తినఁబోవుచు రుచుల నడుగ నేల? కాలహరణ మొనర్పక దిదృక్షాపిపాసితు లగు నీసభ్యుల సంతుష్టిఁ బఱుపుఁడు.

సూత్రి—ప్రేయసీ! నవీనవస్తువిలోకన మెట్టివారికైనను బ్రీతినిఁ బుట్టింపక మానదుసుమా! ఇటు చూడుము.

గీ॥ పంకజాగారముల వీడి • భ్రమరపాళి
చూతసుమసౌధవీథులఁ • బ్రీతినెఱపు
భవనమును బాసి నెచ్చెలుల్ • బలసికొలువ
విపినమును జూడవచ్చు సావిత్రివోలె.

ఇఁక మనము పోయి కర్తవ్యమునకుఁ గడంగుదము రమ్ము.

[అని ఇరువురు నిష్క్రమింతురు.]

ఇది ప్రస్తావన.



# సావిత్రీ నాటకము

## ప్రథమాంకము.

[ వనము ]

సఖులు—[ తెరలో ] అమ్మా! ఇటు, ఇటు. [ అని సఖులు త్రోవఁ జూప శ్యామలా సావిత్రులు ప్రవేశింతురు. ]

శ్యామ—సఖీ! ఉద్యానవనమును మించి యీప్రదేశ మెంత మనోహరముగ నున్నదో చూడుము.

సావి—సహజశోభను గృత్రిమ మతిక్రమించునా?

శ్యామ—చెలీ! మహారాజకుటుంబము నాదరించుచున్నదో యనునట్టు లీ వనదేవత యెంత యామోదమును జూపుచున్నది?

సీ॥ ఇనరశ్మలను సోఁక • నీయని శాఖాక
దంబకం బాతప • త్రింబుఁ జేసి
మలయమారుతకేళిఁ • జలియించు పూఁగొమ్మ
గము లల్ల వింజామ • రములఁ జేసి
చిగురుకై పునఁ గొంతు • లెగయఁ బాటలు వాడు
పికముల వందిపా • ఠకులఁ జేసి
కమ్మనెత్తావి ది • గ్వలయమ్ము నం జిమ్ము
పూలసోనలు సేసఁ • బ్రాలు సేసి
భృంగగాయకగానప్ర • సంగములను
బర్హివారాంగనానృత్య • వైభవములఁ
గూర్చి వనదేవి నిన్నెదు • ర్కొనఁగ వచ్చె
నధిపు లెందుండు రందందె • యలరు సిరులు.

సావి—శ్యామలా! నెచ్చెలి వాసంతిక యింకను రాకున్న దేమి?

శ్యామ—ఏదియో పఠించుచుండనోపు. వాసంతిక వచ్చువఱకు విశ్రమింతము, రమ్మ.

సావి—ఔను, విద్యాభిలాషిణు లట్లేకదా యుండవలె. [అని శిలాతలమునఁ గూర్చుందురు.]

శ్యామ—సఖీ! మీ స్నేహ మెంతచేసినను నే నెందును గృతకృత్య నగుదు నన్న యాశ కలుగుటలేదు.

సావి—శ్యామలా! శ్రద్ధతోఁ బ్రయత్నింపవలయునుగాని, ప్రయత్నించినవారి కసాధ్య మొకటి యుండునా?

మ॥ ప్రణుతింపం దగు సత్కళాపటిమ దిఃవ్యజ్ఞానసంపత్తినిన్
మణిమంత్రౌషధు లాదిగాఁగల జగఃన్మాన్యప్రభావంబులన్
గణనీయం బగు స్వర్గమున్ గొనను శఃక్తల్ గారె యీ యంగనా
మణు; లింతేటి కశక్య మొండు గలదేః శ్యామ డలిన్ నెచ్చెలీ!

శ్యామ—అవును. సంశయములేదు. సఖి! ఇంకఁ బట్టుదల వహించి శాస్త్రాధ్యయన మొనరించెద.

సావి—అంతటి పట్టుదలనే వహించిన వాసంతికను మించెద వని తలంచెద. సర్వకార్యయములు సాధించెద వనియు సంతసించెద.

[అంత వాసంతిక కాకితమును జేతఁబుచ్చుకొని ప్రవేశించును.]

శ్యామ—సఖీ! ఇక్కడ, ఇక్కడ.

వాసం—ఇదిగో వచ్చుచున్నాను. [అని మరలఁ జదువుట నభినయించును.]

శ్యామ—సఖీ! ఏదో పద్యమును వ్రాసి సరళ శబ్దప్రయోగము నకుఁ గాఁబోలు మరల మరలఁ జూచుచున్నది. యోజించి వ్రాయుటయేకదా సరసకవితకు లక్షణము!

వాసం—[సవరణ నభినయించి] నెచ్చెలులారా! నాకై యెదురు చూచుచుంటిరి కాఁబోలు! కాలహారణమునకు మన్నింపుఁడు.

సావి—[వాసంతికబుజమునఁ జేయువైచి] సఖీ! నేఁ డేల యాలసించితివి?

వాసం—ఆలోచనానిమగ్ననై వచ్చుచున్న నన్ను మహారాజ్ఞి మాళవీ దేవి పిలిచె.

సావి—మా యంబ పిలిచెనా? తరువాత.

వాసం—మహారా జందే యుండుటచే నించుక జంకితిని, గాని చిర పరిచయము రాజసమక్షమునకుఁ జేర్చినది.

సావి—నా కంటె నతిప్రీతిగ నాదరించు నాతండ్రిగారికడ కేగుటకుఁ గూడ జంకితివా?

వాసం—సఖీ! ఎంత చన వున్నను రాజసమక్ష మించుక భయమును గల్పింపక మానునా?

సావిత్రి—ఔను. పిమ్మట నేమి జరిగినది?

వాసం—నా యాలోచనకుఁ గారణ మడిగి పద్యమును జదివించి యీ రత్నాంగుళీయకమును నా వ్రేల నుంచిరి.

శ్యామ—ప్రభుసంతోషమునకు బహూకారమేకదా నిదర్శనము. వాసంతిక! సరస్వతీ చతుర్ముఖు లనందగు నా రాజదంపతుల యానందమునకుఁ బాత్రి మగు నీ మేధావిశేష మెంత యని మెచ్చుకొందును.

సావి—సఖీ! ఏ విషయమును వర్ణించితివి?

వాసం—అఖండనైభవోపేతు లై మహారాజలాంఛనవిరాజితు లైన అశ్వపతి మహారాజుగా రిచ్చట మానివర్యుల సాదరమున సేవించుచుండుటఁ జూచి మునిజనపరిభావ మనన్యసామాన్య మని మెచ్చి యిట్లు వ్రాసితిని.

సావి—[సంతోషముతో] ఏదీ చదువుము.

వాసం—సీ॥ అఖలధరాతలం • బర్పించు భూజాను
లుండియుఁ జెయిఁ జాప•కుండువారు
పిడుగుఁబోలెడు శాప • మిడ శక్తు లయ్యును
నపకారులను విడ•నాడువారు
స్వర్గసౌఖ్యం బైన • సమకూర్చువా రయ్యు
మృగచర్మధారులై • మెలఁగువారు

ధనహీను నిందుఁ)నం•తగఁ జేయువా రయ్యుఁ
గాయలాకులఁ బొ)్దు • గడుపువారు

అతులితై శ్వర్యసుఖముల • నందఁగలిగి
యైహికేచ్ఛల నన్నింటి • నవలఁదో)సి
పరమె ముఖ్యంబుగా నెంచు • పరమ మునుల
శక్తిసామర్థ్యముల నెన్న • శక్యమగునె?

సావి—సఖీ! నీ వర్ణనము మిగుల ప్రశంసనీయము. ఐహికవాంఛల విసర్జించి శీతాతపంబుల కోర్చి యాత్మను బరమాత్మయం దైక్యము గావించి మహానంద మనుభవించు మునిజనప్రభావ మెంతని వర్ణింప నగును? ఐహికవాంఛ లననేమి, స్వర్గాద్యుత్తమ లోకంబులను గాని, యణిమాది సిద్ధులనుగాని, యంత యేల మోక్షమునుగాని సాధింపనెంచిన వనవాసము, ఋషిసేవయే గదా మానవులు కోరఁదగినవి! అది యేమోకాని

గీ॥ పరమ మును లన్నఁ దత్ప్రభా•వంబు విన్న
వారిఁ గనుఁగొన్న మోదంబు • ప్రబలి వారి
చెంత నివసించి సద్గోష్ఠి•సేయ నెపుడు
కౌతుకము గల్గుఁ దత్సతీ•గణముతోడ.

వాసం— ఇంతటిజ్ఞానవైభవముం గలిగి బాల్యమునందే గురుహిత బంధుజనాదరముం గన్న సి న్నశ్వపతిమహారాజు వడయుటకు వనవాసము, తపోనియమమేకదా కారణము!

సావి—చెలీ! మహారాజైనను నా జనకుఁడు వేదస్వరూపిణి యగు జగన్మాతను సావిత్రిని సాక్షాత్కరింపఁజేసికొనెనుగదా! తపోబల మెద్దానిని సాధింప సమర్థము కాదు? కనుకనే మునులు—
[అని అర్ధోక్తిచే విరమించును.]

వాసం—చెలీ! మునిశబ్దశ్రవణముచే ని న్నొకటి యడుగ వేడుక పొడముచున్నది.

సావి—అది యేమి?

వాసం—నిన్నటి సాయంసమయమున నిచ్చటికి వచ్చిన మునివర్యునిఁ బ్రశ్నించుచుంటివే, ఏమని ?
సావి—మానవసామాన్యధర్మము లేవి యని.
వాసం—వారి సమాధాన మే మని ?
సావి—దయానత్యశౌచములనియు, స్వకులోచిత కర్మానుష్ఠానమనియు.
వాసం—ఆహా ! చక్కనిమాటు వింటిని. తరువాత-
సావి—మానవులకుఁ దరణోపాయ మేది యని వేడితిని.
వాసం—ఏమి నీ విజ్ఞానము ! చెలీ ! వా రేమి సెలవిచ్చిరి ?
సావి—జ్ఞానమనియు, అందులకు భక్తివైరాగ్యములు సాధనమనియు వచించిరి.
శ్యామ—సఖీ ! స్త్రీధర్మమునుగురించి యేమైనఁ బ్రశ్నించితివా ?
సావి—దానిని మఱతునా ? వనితలకుఁ బతిసేవకంటె వేఱుధర్మమే లే దనిరి.
వాసం—తెలియఁదగినవానినిఁ దెలిసికొంటివి.
సావి—నెచ్చెలులారా ! ఆ మహాభాగునితో మఱికొంత ముచ్చటింపఁ దలఁచితిని కాని యవకాశము లే కూరకుంటిని. మనము పోవు నది మునియాగదర్శనమునకుఁ గదా ! మార్గమధ్యమున నున్న ఋష్యాశ్రమముల నన్నిఁటినిఁ జూపింప జనకుని వేఁడెద. చిత్రముల నవలోకించెద. అక్కడ మునులవలన మఱి కొన్ని ధర్మ రహస్యములఁ దెలిసికొనియెద.
భటుఁడు—[ప్రవేశించి] అమ్మా ! అశ్వపతిమహారాజుగారు ఇప్పుడే చిత్రకారుఁడు దెచ్చిన ఈ చిత్రపటములను దమ కీయ నాజ్ఞ యిచ్చినారు.
సావి—వనవిశేషముల వ్రాయించి యుండును. శ్యామలా ! వానిని గ్రహింపుము.
శ్యామ—[చిత్రపటముల గ్రహించును.]
సావి—ఓయీ ! నీవు పోయి జనకుని యాజ్ఞఁ గొని రథము సిద్ధ పఱుపుము.
భటు—చిత్తము. [అని నిష్క్రమించును.]

శ్యామ—[చిత్రపటములఁ జూచి] సఖీ! ఈ సరోవరమును, దత్ప్రాంతమున నున్న దేవతాయతనమును జూడుము; ఎంత మనోహరముగ లిఖింపఁబడినవో!

సావి—ఔను! చిత్రకారుఁడు కడుంగడు సమర్థుఁడు.

వాసం—సఖీ! వీణాపాణి యైన యీ వాణిని దిలకింపుము.

సావి—ఏదీ? [అని గ్రహించి చూచి] సఖీ! స్వభావము నతిక్రమించ లేదు సుమా!

గీ॥ మొలకనవ్వుల విలసిల్లు ♦ మోము గోము
దరనిమీలితనేత్రప♦ద్మముల సొబఁగు
గానరసమగ్నమౌ మూర్తి ♦ కలికితనముఁ
గాంచ నిజమైన వాణిగాఁ ♦ గానిపించు.

శ్యామ—[రెండుపటముల గ్రహించి] సఖీ! ఆకృతిచే నొక్కరుగా నున్నను వేషముచే నిరువురుగాఁ గాన్పించుచున్నారు. వీ రెవ్వరు?

సావి—ఈమె! హిమవన్నగరాజపుత్రి, పార్వతి.

వాసం—ఔను! ఈమె మణిభూషణాదులే మహారాజపుత్రి యని బోధించుచున్నవి. తపస్వినిగా నుండుటకుఁ గారణము?

సావి—భర్తృప్రాప్తి.

వాసం—అనంతరత్నప్రభవుఁడై, పర్వత రా జని విఖ్యాతిఁగాంచి, నిఖల దేవతాదరణపాత్రుం డగు హిమవంతుండు తన పుత్రిక కనురూపుఁ డగు వరుని సమకూర్పలేకపోయెనా?

సావి—తండ్రి యత్నింపకుండునా? తల్లి యుపేక్షించునా? ఈమె వారి చిత్తవృత్తి ననుకరింప దయ్యె.

వాసం—అనుకరింపక?

సావి—వరాన్వేషణకై తానే స్వతంత్రించె.

శ్యామ—ఇట్లు స్వతంత్రించుట తల్లిదండ్రులఁ దిరస్కరించుట యేమో?

సావి—కానేరదు. భర్తమూలముననే యైహికాముష్మికసుఖంబులు పొందఁదగియుండుటచే స్త్రీ లనుకూలవరునిఁ గోరుకొనుటయే ముఖ్యము.

వాసం—అయిన నీమె కీ తపస్వినీవేష మేల?

సావి—సకలఫలదాతను వరునిగాఁ గోరుకొనుటవలన.

శ్యామ—ఎవ రా మహానుభావుఁడు? ఈశ్వరుఁడా?

సావి—ఔను.

వాసం—ఈ సుకుమారి దుశ్చర మైన తపోనియమంబున కోర్చుటకుఁ దలిదండ్రు లంగీకరించిరా?

సావి—పుత్త్రికాప్రీతి యొక్కింత ప్రతిబంధింపఁ జేసెనుగాని, యామె యభిలాష యత్యుత్తమ మైనదగుటచేఁ దలిదండ్రులకే కాదు, సర్వజనామోదపాత్ర మైనది.

వాసం—[స్వ] ఆహా! ఏమి యామె మనోనిశ్చయము! [ప్రకా] సఖీ! ఆమెకోర్కి సఫలమయ్యెనా?

సావి—సఫల మగుట యేమి? భర్తయర్ధశరీరమునే గ్రహించినది. తపోనియమవ్రతపరాయణు లెన్నఁడైన విఫలు లగుదురా? వారు పొందరాని శుభము లుండునా? అందువలననే కదా, మహారాజులుసైతము రాజ్యభారము పుత్త్రులపై నిడి యరణ్యముల కేగుట!

వాసం—ఆహా! ఏమి యీ సాధ్వీప్రభావము? ఈమె పవిత్రచరిత్రము సతుల కాదర్శకముకదా!

శ్యామ—(ఆతురతతో) సఖీ! ఈ పటమును జూడుము, ఎంత వింతగ నున్నదో! [ఒక పటమును దీయును.]

వాసం—ఏదీ! ఏదీ! [అని చూచి యాశ్చర్యముతో] సఖీ! ముద్దులు మూటగట్టు మూఁడుశిరములు గల యీ బాలుఁ డెవ్వఁడు? శాంతస్వరూప యగు నీ తపస్విని యెవ్వ తె?

సావి—ఈమె యనసూయ. ఈమెను బరీక్షింపవచ్చిన త్రిమూర్తులను మూఁడుతలలు గల బాలకునిఁ జేసి యాడించుచున్నది. అతఁడే మహానుభావుఁడు దత్తాత్రేయస్వామి.

శ్యామ—
వాసం— } [ఆశ్చర్యముతో] ఔరా! పతివ్రతాప్రభావము ముమ్మూర్తులను గూడ బాలకులఁ జేసెఁగా!

సావి—యథార్థమైన పతివ్రత కొక త్రిమూర్తు లేమి, లోకము లన్నియు స్వాధీనములే యగును.

వాసం—తలంచినపు డెల్ల మహోత్సాహమును గలిగించి పాతివ్రత్య మహిమను బ్రకటించు నీ చిత్రపటముల మనము ముఖ్యముగ నుంచుకొనవలసినదే.

సావి—సందేహ మేమి?

గీ॥ సతము సౌశీల్యవతు లగు • సతులచరిత
మాలకించుచు హృద్వీథి • యందు వారి
నిలిపి తద్రీతి వర్తించు • నీరజాక్షు
లందరానట్టిఫల మున్నె • యవనిలోన?

[తెరలో]

భటుఁడు—అమ్మా! రథము సిద్ధమైనది.

సావి—నెచ్చెలులారా! మునిబాలకులవలన నిచ్చట మునిపల్లె యొండు కలదని వింటిని అచ్చటి కేగి మునిపత్నుల సందర్శింతము.

శ్యామ—
వాసం— } అంతకన్నఁ గాఁదగిన దే మున్నది?

సావి—శ్యామలా! పరిచారికలఁ గలిసి పూజాద్రవ్యములఁ దీసికొని రమ్మ.

శ్యామ—అటులనే.

సావి—వానంతికా! మనము పోవుదము రమ్మ.

[అందఱు నిష్క్రమింతురు]

---

[వనప్రాంతమున సత్యవంతుఁడు విచారముతోఁ బ్రవేశించును.]

సత్య—అహా! కాలమహిమ యెట్టివారి కైన దురూహముకదా!

మ॥ తరమే బ్రహ్మకునైనఁ గాలమహిమల్ • తర్కింపఁగా శౌర్యదు
ర్భరులౌ ప్రాజ్ఞులు మానవంతులు మహా•రణ్యంబులం బట్ట దు
ర్ధరసామ్రాజ్యమునేలుచుండుదురుపం•దల్ కట్ట!మున్నింద్రుఁడున్
సరసీజంబున డాఁగఁగా నహుషుఁ డా • స్వర్గంబు పాలింపఁడే?

మహారాజపుత్రుఁడ నైనను నాకీ యరణ్యవాసక్లేశము తప్పకపోయెనుగదా!

మ॥ ధనువున్ సర్వవిధాయుధంబు లనుపొం•దన్ గేలఁ గీలించి, తోఁ
జనుదేరన్ ధరయీనినట్లు బలముల్ • శౌర్యంబు దీపింప దు
ర్జనులం దుంచెడు నాకు గొడ్డలియునుం•ద్రా డివ్విధిందాల్చి యిం
ధనముల్ గొట్టఁగనయ్యె నెందు విధివ్రా•తల్ తప్పునే యేరికిన్!

జన్మాంతరమునం బొనర్చిన పాపపుణ్యఫల మెట్టివారి కైన ననుభవింపక తీరదుగదా! అయినను బురుషప్రయత్నము లేక యెట్టి స్వల్పకార్య మైనను సఫలము కానేరదు. అందును క్షత్రియులు ధైర్యసాహసముల నవలంబింపకున్న స్వకులోచితమైన సామ్రాజ్యపదవి నలంకరింపనేరరు.

ఉ॥ క్షత్త్రియజాతిఁ బుట్టి మునిచంద్రుకృపన్ గళ లభ్యసించి లో
కత్రయమైన గెల్వఁదగు • కార్ముకవిద్య గడించి దుష్టులౌ
శత్రులఁ జంపకుండుటలు • క్ష్మాపతి కొప్పునె? ధర్మరక్షకుం
బాత్రముగాని క్షత్త్రియుల•బాహుబలం బది యేల కాల్పనే?

కావున నే నిదె వెళ్ళి మారాజ్యసర్వస్వము హరించిన దురాత్ముల గర్వనిర్వాపణం బొనర్చి మత్పూర్వార్జితం బైన రాజ్యమును మరలఁ గైకొనియెద.

ఓరీ! దురాత్మా! ఉగ్రసేనహతకా! నీ కాయువు మూడినది సుమా! [ముందునకు నడచి రోషముతో]

శా॥ నీచత్వంబునఁ గన్నుఁగానక బుధుల్ • నిందింతు రం చాత్మస
కోచం బించుక లేక మజ్జనకుఁ జీ•ర్ణు వృద్ధునిం దోలి మ
త్ప్రాచీనార్జితపూజ్యరాజ్యపదవిన్ • బ్రాపించి దీపించెదే?
ఈ చిత్రాశ్వుఁడు మేనఁ బ్రాణములతో • నేపారఁ బెంపారెదే

[విమర్శించి] దురాత్ములు శత్రువులు మాయెడ నొనరించిన
దుష్కృత్యమున కొడలుఁ మఱచి పలుకుచుంటినే కాని యిప్పటి
నావ్రియత్న మంతయు నెండమావుల నీరుఁ గ్రోలఁదలంచువిధ
మున వ్యర్థముగా కుండునా? ఎంత శౌర్య మున్నను బ్రాజ్ఞుల
సమయానుసారముగఁ బ్రవర్తింతురు కాని యసమయంబున
దందర నొందుదురా?

సీ॥ వివిధాయుధకళాప్రవీణు లౌ శత్రుల
నలుగైన లేకుండ • గెలువవశమె?
ప్రబలదోర్బలబలా•స్పదు లైన వైరులఁ
బిలువ బంటును లేక • కలఁపనగునె?
కరితురంగమరథో•త్కటు లైన భటపంక్తి
నశ్వమైనను లేక • యణఁపనౌనె?
పవిదుర్దమోదగ్ర•కవచు లౌ వీరుల
నజినధారికి గెల్వ • నలవియగునె?

చటుల భీషణ బలకర • స్ఫార సకల
సాధనాగ్ర్య ప్రభూత వి•స్తార ధాళ
ధళ్య శోభిత దశ దిశాం•తః ప్రపూర్ణ
వైరిబల మేడ? నా బాహు•బల మ దేడ?

ఇది యేమి యిట్లు తలంచుచుంటిని? మునివరదత్తంబులై
సకలధాత్రిని జయింపఁగల యస్త్రశస్త్రంబులు నాకడ నుం
నే నీ శత్రువుల గిత్రువుల లెక్కసేయుదునా! ఇపుడే న
జననీజనకుల యాజ్ఞ వడసి జైత్రయాత్రామహోత్సవానం
మనుభవించెద. [స్మరణ మభినయించి] ఏమి నా వెఱ్ఱి? శత్ర
విజయమునకై నాజననీజనకు లాజ్ఞ నిత్తురా? ఇంతియేకా

యొక్క క్షణ మగపడక యున్నఁ గొడుకా కొడుకా యని దుర పిల్లుచుండెడి యంధుల నాతల్లిదండ్రుల నెవరు వీక్షింతురు? గర్భధారణాది బహువిధక్లేశముల ననుభవించి యాత్మకంటె నెక్కుడుగఁ జూచుచు నెంతయో ప్రేమంబునం బెంచెడి జననీజనకుల సేవకన్న ధనకనకవస్తువాహనాది సంపద లేమి, ఒక మహీరాజ్యపరిపాలన మేమి, స్వర్గ రాజ్యపదవి యైనను ఎక్కువ కానేరదే? కావున మాతాపితృ సేవాపరాయణుండనై కాల నిరీక్షణముఁ జేసెద.

[తెరలో] సత్యవంతా! సత్యవంతా!

సత్య—మిత్రులారా! యిక్కడ, యిక్కడ.

[శారద్వత వీరవ్రతులు, ఇతర బాలురు ప్రవేశింతురు.]

వీర—మిత్రమా! నీకై చూచుచుంటిమి, ఇందే యుంటివా?

సత్య—ఎందులకు?

వసం—మా వివాదఁ దీర్పఁగలందులకు.

సత్య—మీ వివాద మేమి?

వసం—నాలుగాశ్రమములలో నేది ప్రశస్త మని.

సత్య—మేధానిధుల రగు మీసంశయము నేనా తీర్పువాఁడను?

శార—మిత్రమా! ధీవిశారదుండ వగు క్షత్త్రియుండవు నీవు గాక మఱి యెవ్వరు న్యాయనిర్ణయమునకు సమర్థులు?

సత్య—మీకు నాయెడఁ గల ప్రేమాతిశయమున కే నెంతయు సంతసించుచున్నాఁడ. మిత్రులారా! ఆ యా ధర్మముల నెరవేర్చుకొనుచున్న నేయాశ్రమ మైన నుత్తమమే కాని "బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి" అను నార్యోక్తిచొప్పున భ్రమప్రమాదముల నెన్నిఁటి నైనను గాపాడుకొనుటకు మానవ సామాన్యులకు గృహస్థాశ్రమమే యుత్తమ మని పెద్దలు చెప్పుదురు. ఇంత యేల? ప్రపంచమున నెందుఁ జూచినను ద్వైతమే కానంబడుచుండును. ఇటు చూడుఁడు,

మధుమదిరాస్వాదన ప్రముదితాయమాన మానసంబులై మదనశింజినీరవ మబులకరణి శ్రుతిరంజన మొనరించుచు మన నురాగము గల నాయికానాయకులవలె సంచరించు మధుక దంపతుల యనురాగాతిశయంబును, చిత్రపత్రాంశుక పరి భితలై నవ్యారుణపల్లవాధరమనోహారిణులై కుసుమగుచ్ఛ స్తనవిభాస్వరలై పున్నాగశాఖాబాహులఁ బెనంగిన లత కాంతల ప్రేమవిశేషంబును, క్షుద్బాధ కోర్వఁజాలక తమ చిరుతపక్షంబుల నాడించుచు వివృతవదనంబులై దిక్కుల దిలకించి తల్లులకై పలవించు పక్షిశాబకంబులకు ఫలజలంబుల దెచ్చి యిచ్చి సంతసం బొదవించు నీడోద్భవముల సంతా వాత్సల్యాతిశయంబును జూడఁజూడ నీప్రదేశం బెంతయు నావిర్ వించిన గృహస్థాశ్రమధర్మమున కాటపట్టన హృదయానం మొదవించుచున్నది. కావున సృష్టికారణమై సకల పురుషా ములకు స్థానమైనది గృహస్థాశ్రమ మని నాయభిప్రాయము

వీర—మిత్రమా! నీ నిర్ణయము మిగుల ప్రశంసనీయము.

శార—సత్యవంతా! నీవు బుద్ధిని బృహస్పతి సమానుఁడవు. నీ కెవ రీడు రాఁగలరు?

వసం—మిత్రమా! ఈ యాశ్రమప్రాంతమున కెవ్వఁడో యొ రాజపుంగవుఁడు వచ్చెనఁట!

సత్య—ఎందులకు?

వసం—రేవా నదీతీరమున మును లొనర్చెడి యాగమును జూ గలందులకు.

సత్య—ఐన నేమి?

వసం—వారి వైభవముఁ జూడ వేడుక వొడముచున్నది. కావు బోదము రమ్ము

సత్య—మన మిట్లేగిన వనవాసులు ప్రపంచజ్ఞానశూన్యులని కొంద వెడఁగు లభిప్రాయపడుదురు. పురాణేతిహాసములయం దా

తేరి సర్వరసస్వరూపములఁ బుక్కిలించి శాస్త్రదృష్టిచే నిందాద్రిబృందారక వైభవముంగూడ చూచెడి మీ కీరాజ్య వైభవ మానందజనక మగునా? అయినను లక్షణజ్ఞానమున లక్ష్యములఁ బరిశీలించుట యుక్తమే మీరు పోయిరండు. నే నిందే కుసుమములఁ గోయుచు మీ రాకకై యెదురు చూచుచుండెద.

వసం—ఇక్కడనే యుందువా?

సత్య—నే నసత్య మాడుదునా!

వీర—నీ వసత్యమాడిన సత్యవంతుఁడను నామము నీ కేల కలుగును?

శార—కాలవశమున నిందుంటివి గాని నీ కీ రథగజాశ్వములు లెక్కలోనివియా? కానిమ్ము. మేమే పోయివచ్చెదము.

[అని మునిబాలకులు నిష్క్రమింతురు.]

సత్య—ఆహా! ఈప్రదేశ మెంతమనోహరముగఁ గానిపించుచున్నది! ఈ మలయపవనసుఖ మనుభవించుచు సుమంబులఁ గోయుచుండెద. [అని పుష్పాపచయ మభినయించుచుఁ జెవి యొగ్గి] ఎచ్చటివి వీ రథనేమిధ్వానములు?

సావి—(తెరలో) సూతుఁడా! రథము నిందే యుంచుము. మునుల యాశ్రమములు సమీపించితిమి. ఇచటినుండి పాదచారిణులమై వెళ్ళఁగలము.

సత్య—చిలుకపలుకులవలెఁ గర్ణానంద మొనరించు నామృదుమధుర స్వరము స్త్రీస్వరముగ నున్నదే! అగుఁగాక! [పుష్పములు గోయుట నభినయించును.]

వాసం—[తెరలో] భర్తృదారికా! ఇటు, ఇటు.

సత్య—భర్తృదారికా యనుచున్నదే! [చూచి నిశ్చేష్టుఁడై సంభ్రమముతో] ఆహా! ఏమి యా తనూవిలాసము! ఏమి యాపె గమనవైచిత్ర్యము!

మ॥ చెలికేలం దనకేలు పూన్చి వెనుకం • జీరాడు పయ్యంటతోఁ
జిలుగుంబావడఁ దీన్చుకొంచు మణిమం • జీరధ్వనుల్ మీరఁగా
లలితోత్కర్షల్ మెలమెల్ల నాడుచును హేలాలోలయై యివ్వనిం
గలయంజూచుచు వచ్చెడుం గలికియో • కంజాస్త్రుపూముల్కి యో.

[సావిత్రి వాసంతికలు యథోక్తముగఁ బ్రవేశింతురు]

సత్య—ఏమి! యీ రమణీమణితనూరామణీయకము!

మ॥ కనుదమ్ముల్ శ్రవణాంతికంబొరయు; రా • కాచంద్రబింబంబు నీ
యనంగాఁ జాలును నెమ్మొగమ్ము; జడ నా • ట్యంబాడు శ్రోణీతటిం
దనువల్లీజనితోరుగుచ్ఛముల చం • ద బొప్పు; చందోయిచేఁ
దనువల్లాడఁగ మందమందగతి ని • త్తన్వంగి యెం దేగునో?

సావి—
వాసం— } [నలుదిక్కులు చూచి]

వాసం—సఖీ! ఇచ్చటి కుసుమంబు లెంత మనోహరములుగ నున్నవో చూడుము. [అని యిరువురు పువ్వులు గోయుట నభినయించుచుందురు.]

సత్య—[స్వ]అదిగో! పుష్పములఁ గోయుచు సఖీసమేతయై యా తరుణి యిటే వచ్చుచున్నది. [పరికించి] ఏమి యీ యద్భుతాకారము! కనులకు మిఱుమిట్లు గొల్పుచున్నదే!

సీ॥ వెడవెడం బఱతెంచు • వీక్షణంబులఁ జెట్ల
నల్లకల్వలతోరణములు కట్టి
మినమినలాడెడు • మేనికాంతులఁ బువ్వ
పొదలకు బంగారుపూతఁ బూసి
యధరంబుపై నడయాడు లేనగవులఁ
బల్లవపాళికి • వెల్లవేసి
నెత్తావి నలరారు • నెమ్మొగంబునఁ బూల
కదుగు భృంగంబుల • కానఁగొల్పి

మారు విజయాస్త్రిఁ జేయు దేవేరి యనఁగఁ
దనువుఁ దాల్చిన శృంగారతత్త్వ మనఁగ
రమణుఁ గనవచ్చు నారామరమణి యనఁగఁ
జెలువ చెలువారు నివ్వనసీమ నౌర!

సత్కవుల వాక్కులయందును, చిత్రకారుని లేఖినికి సందని యిట్టి సౌందర్య మెందైన నుండునా? ఇక్కాంత నే భూకాంతుండు చిరంతనతపఃబునకు ఫలంబుగఁ బడసెనో! ఈ రమణి రమణీయారుణ చరణపల్లవ లాక్షారస మనోహరంబులై యే సౌధరాజంబు లున్నతివహించెనో? ఈ సుందరి మందస్మితచంద్రికాప్రసరణంబునకు ధన్యంబై యిత్తరళాక్షి కటాక్షవీక్షణములకుఁ బాత్రుఁడై యిత్తరుణి తారుణ్యమే భూరమణుండు తమిదీర ననుభవింప నెంతటిపుణ్య మార్జించి జనించెనో యూహింపఁజాలకుంటినే! ఏమి యీ చిత్రము! పరకాంతలన మాతృభావమున సంచరించు నాకు నీ చంచరీకాలక, నీ యంచయాన, నీ మించుబోణిఁ గాంచినంతనే ధైర్యకంచుకము పటాపంచ లగుచున్నదే! దీని కేదియో మహత్తర మైన కారణ ముండకమానదు. ఎన్ని కారణము లున్న నేమి? ఈ కుసుమకోమలి యసమానతనూవిలాసమే ప్రథమకారణము.

గీ॥ హరుజటాజూటమందున • నధివసించి
విహరణ మొనర్ప నందందు • విశ్వమునకు
నేగుదెంచిన శశిరేఖయే నిజంబు;
కాక మత్స్వాంతకువల మాకాంత మగునె?

సద్వస్తువర్ణనము వాక్కునకుం బోలె సుందరవస్తువిలోకనమే కదా నేత్రము లున్నందులకు ఫలము? కావున నే నీ తీవెల చాటునుండి తమిదీర నీ సౌందర్యరాశి నవలోకించెద.

సావి—ఆహా! ఈ ప్రదేశ మెంత సంతస మొదవించుచున్నది! చెలీ! ఋష్యాశ్రమపరిభావ మనిర్వాచ్యముకదా!

సీ॥ మునుల సందర్శింపఁ • జనుదేరువారికిఁ
గెరలి స్వాగతమిచ్చు • కీరచయము
మార్గం బెఱుంగని • మనుజుండు వచ్చిన
దారిఁ జూపించు మ • యూరసమితి
అతిథు లేతెంచిన • నరిగి ఋషీంద్రుల
గీరి చూపించు మృ • గీగణంబు
వాంఛితార్థంబులు • ఫలియించు గతి ఫల
దాన మొసంగు సీ • తరువితాన
మాశ్రమోపాంత విహగ మృ • గాదు లెలమి
నాతిథేయం బొనంగి ప్రి • యంబు సూప
ధన్యులై నట్టి యత్తపో • ధనుల నెపుడు
గొలుచువారి కభీష్టముల్ • కొఱఁత వడునె?

వానం—అందునకు సందియం బేమి?

సావి—సఖీ! ఎన్నియో యాశ్రమములఁ జూచితిమి గాని యీప్రదేశంబులఁ జూచినకొలఁది చూడ వేడుకఁ గలిగించుచు మా గృహారామాదులఁగూడ మఱపించి కొంతకాల మిందే యుండ నుత్సాహముఁ గల్పించుచున్నది.

వానం—సఖీ! ఈ స్థలవిశేషమే యిట్టిది.

సత్య—[స్వ] కొంత కాల మేమి? ఎంతకాలమైన నుండవచ్చును. ఇట్టి యువతీశిరోమణులచే నాశ్రమప్రదేశములుకూడ వాసి గాంచు ననుటకు సంశయము లేదు.

సావి—చెలీ! నానావిధ కుసుమ విసర విభాసురంబులై స్వభావ రమణీయంబు లగు నీ లతామతల్లులఁ బల్లవహస్తంబుల నాద రించు నీ పున్నాగరాజమును జూడుము.

వానం—సఖీ! సానురాగ యయ్యు నీ లతాకాంత వరుని సమీపించు నవవధువువోలె ముఖ మావలకే త్రిప్పుచున్నది చూడుము.

సావి—ఇది నైజమే.

సత్య—[స్వ] జడములయందుఁగూడ నిట్లుండుటచేతనే కామినీహృదయము నారికేళపాకముగ నుండునని యనుభవజ్ఞులు చెప్పుదురు.

వాసం—సఖీ! ఇంకను సఖులు మునిపత్నీపూజాద్రవ్యములు తెచ్చుటలేదు. వారు వచ్చువఱకు నీ మనోహరప్రదేశంబున నొకింత విశ్రమించి మలయానిలము సేవింప నీ పువ్వుల మాలికఁగాఁ గూర్చుదము రమ్మ. [అని పూసెజ్జనుంచి ప్రదేశము చక్కజేయుచుండును.]

సత్య—[స్వ] తాపసీజనపూజాలాలన యగు నిక్కోమలిసౌశీల్య మెంతయు మెచ్చఁదగినది కదా!

సావి—[పరికించి సవితర్కముగా స్మరణ మభినయించి] అంతయు నిక్కముగఁ దోఁచుచున్నదే.

చ॥ చతురతఁ దొల్త నన్గని ప్రశంస యొనర్చినతావు లివ్వి, తాఁ
గుతుకమునం జెవిం దురుమఁ గొన్ననఁ గోసిన తీవ యిద్ది, పు
ష్పిత సుమసౌరభం బనుచుఁ బ్రేముడిఁ జూపిన కుంజ మద్ది, య
య్యతులిత మూర్తిదక్కనిది యంతయు నయ్యదియే తలంపఁగన్.

వాసం—సఖీ! ఏమి యోజించుచున్నదానవు?

సావి—కల నిజమగునా యని తలంచుచున్నదాన.

వాసం—కల యెప్పుడు వచ్చినది?

సావి—ఎప్పుడు వచ్చును? రాత్రియందే కదా!

వాసం—కడచిన రాత్రియందా?

సావి—ఔను; మేల్కాంచుటకుఁ బూర్వము.

వాసం—సఖీ! చెప్పు, చెప్పు.

సావి—[ఇంచుక లజ్జ నభినయించి] సఖీ! ఇప్పు డేమి? యెప్పుడైనను జెప్పెద లెమ్మ.

సత్య—[స్వ] ఈ యువతి స్వప్నవృత్తాంత మన్నంతనే యవనతవదన యగుచున్నదే! ఇట్టి లజ్జాజనకమైన కల యెట్టిదై యుండునో?

వాసం—సఖీ! ప్రాణమునకన్న మిన్నయగు నమ్మకము గలిగిన నాకుఁ జెప్పుటకుఁ గూడ సమయాంతరము కావలయునా?

సత్య—[స్వ] వాసంతికా! బాగుగఁ బల్కితివి. ప్రాణమునకన్న నేమి, హృదయమునకన్న మిన్న యనుము. రాజపుత్రికల సర్వసౌభాగ్యములు నెచ్చెలుల చేతులలోనివే కదా!

సావి—చెలీ! ముని పూజకు నాలస్య మగునని తలంచితినిగాని వేఱుగఁ దలంపకుము నా హృదయము నీ యెడ దాఁచుకొని పిదప నే నేమి సౌఖ్య మనుభవింతునే?

వాసం—అట్లయిన నింకను జెలులు వచ్చుట లేదు; చెప్పుము.

సావి—సావధానవు కమ్మ

సీ॥ సిందుచందురు సౌరు • నిరసించు నెమ్మోము
గండుతుమ్మెదపిండుఁ • జెండు కురులు
వెలిదమ్ముల బెడంగు • వెలిజిమ్ము కన్నులు
నింపారు మొలకమీ•సంపు సొంపు
నగరితల్పునఁ జెల్వ • మిగురొత్తు వక్షంబు
కరికరంబుల నోర్చు • కరయుగంబు

సత్య—[స్వ] ఆహా! ఈసుందరికిఁగూడ వర్ణనీయుఁడైన పురుషుఁ డెంతటి ధన్యాత్ముఁడో కదా!

సావి—తాపసవేషంబు • మూఁపున గొడ్డలి
చేతఁ దాడ్రొక్కండు • చెలువు గొలువ

సత్య—[స్వ] ఏ మేమి? [అని తన్నుం జూచుకొనును.]

సావి—గీ॥ శాంతియే భూషణంబుగ • శ్రద్ధతోడఁ
జెఁకు లగు తల్లిదండ్రుల • సేవఁజేయు
నిండుప్రాయంబు గలిగిన • నెమ్మికాని
సుదతి! కలఁగంటి నొక్కని • మదనసముని.

సత్య—[స్వ] చిత్తమా! కొంచె మూరకుండుము. ఆ స్వప్నగత పురుషవిశేషణములన్నియు నాయందుఁగూడ ననువర్తించుచున్నవే! స్వప్నగతపురుషుఁడను నేనే యగుదునా? నా కట్టి భాగ్యము కూడనా?

వాసం—చెలీ! తరువాత నేమి జరిగినది!

సావి—సఖీ! ఏమి చెప్పుదునే?

సత్య—[స్వ] ఏమిచెప్పును నను చున్నదే ఆతఁడీమెకు సంతాపకారణము కాఁడుగదా!

వాసం—సఖీ! వేఱుగాఁ దలఁపక యది యెద్దియైనఁ జెప్పుము.

సావి—చ॥ అది స్మరియించువేళ చెలియా! యిది యిట్టిదఁటన్నయూహ నాకొదవదుగాని యాత్మకు నెందో యనుభూతి జనించు నంత నెమ్మదికిఁ గలంత మైమఱపు మానని గద్గదపాటు స్వేదముల్ హృదయవికాసవిభ్రమము లెన్నియొ కల్గు నదేమి హేతువో?

వాసం—సఖీ! తరువాత నేమి జరిగినది?

సావి—చెలీ! కడపటిమాటఁగూడ వినుము.

మ॥ కలికీ! రమ్మని చేరఁబిల్చి నను బింగ్గం గౌఁగిటంజేర్చి చక్కిలిముద్దాడి ప్రియోక్తులం దనిపి యాంకేళివర్గ గుటీగల్గునంధులు నాతల్లియుఁ దండ్రి వారలకు సంతోషంబు చేఁగూర్చులే తలఁపక యాగముల్ వ్రతంబులనుభూదానాదులౌనం చనెన్

పిమ్మట నే సందుల కియ్యకొని ప్రియభర్తరంజిల్ల సంధుల నత్తమామలుగ సేవించుచుండ నింతలోఁ బ్రాభాతికమంగళ తూర్యారావంబులు చెవింబడి మేలుకంటిని. ఇదియే నాస్వప్న వృత్తాంతము.

సత్య—[స్వ] ఈ కథ యంతయు నాకు సంబంధించినదే కాని, యీయామె స్వప్నగతపురుషునే వరించు నని సిద్ధాంతము సేయు టెట్లు? నెచ్చెలి యేమో యనఁబోవుచున్నది. [వినుట నభినయించును.]

వాసం—చెలీ! అంధసేవ యేమోకాని సుందరాకారుండగు రాకొమరుండు కనఁబడుట శుభోదర్కమనుటకు సందియము లేదు. కొలఁది దినములలో నొకమహారాజును జేపట్టఁగలవు. మాకు రాజపుత్త్రీపరిణయ మహోత్సవావలోకనంబులును, విందుభోజనంబులును సమకూరును.

సత్య—[స్వ] నీ విందుభోజనము నా సంశయము తీరిన పిమ్మటగదా!

సావి—ఎవరో రాజపుత్త్రుఁ డనుచుంటి వేమి?

వాసం—ఎవరోగాక స్వప్నమం దగపడిన మహాభాగునే వరియించెదవా యేమి?

సత్య—[స్వ] నా మనస్సంశయములన్నియు వీరిసంభాషణముఁలవలన
విస్పష్టము లగుచున్నవికదా! నా భాగ్య మెట్లు పరిణమించునో
నే నూహింపఁ జాలకున్నాఁడను.

గీ॥ స్వప్నగత యువరత్నంవు•సరణిఁ జూడ
నన్వయించుచునుండె నా • కన్నిగతుల
రత్నమని యెవ్వనో, గాజు•రాయి యనునొ
నాతిమన మను రత్నాల•నా [illegible]కాఁడు.

సావి—సఖీ! స్వప్నగతపురుషుని వరింపఁగూడదా?

సత్య—[స్వ] వరింపఁ గూడ కేమి?

వాసం—నెచ్చెలీ! ఎంత పిచ్చిదానవమ్మా! అద్దమునఁ గనఁబడి
ప్రతిబింబమువలె స్వప్నగతవస్తువులు భోగార్హములు కా వ
వేఱుగఁ జెప్పవలెనా? అట్టిచో నీవంటి విదుషీమణి య
కోరికలఁ గోరవచ్చునా?

సావి—సఖీ! ఏమి ఇట్లు వలుకుచుంటివి? స్వప్నమం దపగడిన వస్తు
లుఁడవనియా, యవి యనుభవనీయములు కా వనియా
ఈ వితర్క మేల? మనం బెవని కధీన మగునో మగువ కాతఁ
యధినాథుఁడుగదా!

సత్య—[స్వ] సెబాస్! వరమోత్కృష్ట మగు నీ యభిప్రాయమున
దేవతలుకూడ సంతసింతురుగాక!

వాసం—రాజపుత్రీ! ఏమి నీ నిశ్చయము! నీ వాక్యములు మహాశ్చర
కరములుగ నున్నవే!

చ॥ కలఁ గనినట్టి నాయకునిఁ•గాని వరింప నటంచుఁ బల్కి మ
మ్మలజడి ముంపఁగా నగునె? • యందనిపండ్లకు నఱ్ఱుసాఁచిన
గలదె ఫలం బొకింత; మద•నప్రతిమానులు రాజనందనుల్
గలుగరె? కోరుకోఁదగదె? • కంటికి నచ్చినవాని వారిలోన్.

నీవంటి విదుషీమణు లిట్టిపట్టుపట్టిన మూరాడువారు గలరా
ఈ వృత్తాంతమును విన్న బంధుమిత్రులును దలిదండ్రులును

నీ బేలతనంబునకు నవ్వకుందురా! కాన నట్టిభావమును మఱలించు
కొనుము.

సత్య—[స్వ] ఆహా! ఇప్పు డేమియుఁ దోఁపకున్నదికదా!

వాసం—సఖీ! ఇందుఁ బరిహాసింపఁదగిన దే మున్నది? మనం బెవరిని
వరించునో యాతనిఁ బరిణయంబొడుటయేకదా పతివ్రతా లక్ష
ణము? వేయేల! స్వప్నగతపురుషుఁడే నాహృదయపీఠంబునఁ
బట్టభద్రుఁడయ్యె. ఆతనికే నాప్రేమరాజ్యసర్వస్వము నొసంగితి.
ఇంత యేల? నానిశ్చితాభిప్రాయముఁ జెప్పెద నాలకింపుము.

మ॥ పరిహాసం బొనరించినం జెలులు, మాతృబంధుల్ నివారించినన్,
గురువుల్ కాదని యడ్డుపెట్టినను, దుఃఖుంగల్గువా రెవ్వ రే
కరణిం బల్కిన నోర్తుఁ గాని, కలలోఁ గన్నట్టి యా మన్మన
స్సరసీజోదయభాస్కరుఁ గొలువ కేఁచందాన జీవించెదన్?

సత్య—[స్వ] ఆహా! ఏమి యీ కోమలియనురాగ మనిర్వాచ్యముగ
నున్నదే!

వాసం—సఖీ! స్వప్నమం దగపడెనే, నీమనోహరుం డెం దుండె నని
తలంచెదవు? ఆతనినే వరించెద నని యెట్లు నిశ్చయించెదవు?

సత్య—[స్వ] ఇది యడుగఁదగినప్రశ్నయే. ఇప్పు డేమి సమాధానము
చెప్పునో?

సావి—సఖీ! చెప్పెద వినుము.

చ॥ అరయఁగ దేశదేశముల కంపెద విప్రులఁ దండ్రియాజ్ఞచేఁ,
దిరిగెదఁ గాననాదుల్లిలను దీర్థములన్ సకలప్రపంచ, మా
వరుని లభింపఁజేయు మని ప్రార్థనఁజేసెద దేవినిన్ భవాం
తరమునకైన, నా ప్రియునిఁ దప్పక పొందెద నమ్ము నెచ్చెలీ!

సత్య—[స్వ] ఏమి యీ తరుణి యన్వేషణోద్రేకత, మనశ్శుద్ధి!

వాసం—సఖీ! నీ వలచిన ప్రియునెడల నింతటి పట్టుదల వహించుట
యుక్తమేకాని, నిన్నాతఁ డంగీకరించు నని యెట్లు తలంచెదవు?

సావి—చెలీ! నా హృదయవల్లభుని దర్శనభాగ్య మబ్బవలయునేగాని
యంతటి పుణ్యమే కలిగిన నాతనిఁ గన్నులారఁ గాంచెద.

సేవల దబాంర్థించెద! అంతకు మించిన, నాతని చరణసరో
రుహములకుఁ బ్రాణము లర్పించెద.

సత్య—[స్వ] ధన్యోస్మి! ధన్యోస్మి! నా చెవుల కమృతంబు వోసితి
వాసం—సఖీ! ఇంతటి స్థిరచిత్తముగల నీకు నీ పుణ్యవిశేషమున
ద్వరలో నీ హృదయవల్లభుఁడు లభింపఁగలఁడు. నీకోరిక
సఫలము కాఁగలదు. ఈ పుష్పమాలికను సిద్ధపఱువుము.
యభీష్టసిద్ధికై సావిత్రీదేవికి సమర్పింతము.

సావి—అంతకన్నఁ గాఁదగిన దేమున్నది? [అని యిరువురు పువ్వుల
గుచ్ఛుచుందురు.]

సత్య—[స్వ] తరుణీ! నీ వలచినప్రియునెడల నెంతటి బద్ధానురాగ
వయితివి! ఎంతటి స్థిరచిత్తవైతివి! ఎంతటి పట్టుదల దహించితివి
[అని రెండడుగులు ముందు వైచి]

గీ॥ రమణి! నీకలఁగన్న భూరమణుఁ డితఁడె
యంచు వాక్రుత్తునా? లేక యాత్మభవుఁడు
మూర్తము విధించె నిదె సుముహూర్త మనుచుఁ
జేరి ప్రార్థింపనా? కటాక్షింప నన్ను?
ఇది చేయుదునా, యది చేయుదునా యను నీ వితర్కమేల?
యి ట్లసియెదఁగాక!

మ॥ అవలోకించితి నీమనోగతము ధన్యంబయ్యె జన్మంబు, నీ
యవలోకామృతవృష్టిఁ బైఁబఱవు, మన్యాయంబుగా నేటికి
వ్యవధానంబు 'శుభస్య శీఘ్ర'మని మధ్యస్థుండు పుష్పాస్త్రుఁడా
న నచించుం జుమి నన్ను నేలుకొను గాంధర్వంబునన్ సుందరీ!

[తెరలో] మిత్రవరులారా! మదేశ్వరుని కరిరథాశ్వములఁ
గాంచి బెదరి పులి యొండీ యెడకుఁ జేరినది లభించిన
మాత్రము పత్రపుష్పాదులఁ గైకొని పర్ణశాలల కరుగుదము
రండు.

సావి—[ఆతురతతోఁ బుష్పమాలికను వదలి] చెలీ! ఆశార్దూల
మీయెడకు రాకముందే మన మెందే నరుగవలయును జుమీ!

వాసం—అట్లే యొనర్తము.

ఇరువు—[ఇటు నటు చూచుచుందురు.]

సత్య—[స్వ] బయలుపడుట కిదియే మంచిసమయము. [అని ముందున కేగి] సుందరులారా! మీ రీ వ్యాఘ్రవృత్తాంతమునకు భయపడకుఁడు. నే నిదె వెళ్ళి మత్పరశుధారాహతుల నా బెబ్బులినిం జించి చెండాడి మీ భయము నివారించెద.

వాసం—మహాప్రసాదము.

సత్య—[నిష్క్రమించును.]

సావి—[స్వ] ఆహా! ఏమి యీ యద్భుతము.

గీ॥ జడము చైతన్య మందిన • చందమునను
దల్లి సావిత్రి యొసఁగిన • దానమట్లు
ప్రాగ్భవార్జిత మత్తపః • ఫలము భంగి
నేత్రసాఫల్య మొసగించె • నిక్క మితఁడు.

వాసం—సఖి! ఈ మోహనాంగునిఁ జూచితివా? నీ స్వప్నగత పురుషుఁడు కాఁడుగదా! వ్యాఘ్రవృత్తాంతమున కీ ఋషిబాలకులు భయపడుచుండ దానిఁ జంప సాహసించు నీశూరుఁడు మునిబాలకుఁడు కాఁ డేమో యని సంశయము వొడమెడిని.

సావి—వేషము ప్రశాంతమయ్యును దేజ మనన్యసామాన్యముగఁ గన్పట్టుచున్నదే! ఆహా! విధివిలాసము! మాణిక్యమును మసిపాతఁ గట్టునుగదా!

సీ॥ జడలుకట్టినఁగాని • కడు ముదంబిడు కురుల్
చక్కదువ్విన నెంత • సౌరుఁగనునొ
గొడ్డలిఁ బూనినఁ • గొమరారు హస్తంబు
ధనువుఁ బట్టిన నెంత • తనరఁగలదొ
పల్కలాదులనైన • వఱలెడి నెమ్మేను
జిలుఁగువల్వల నెంత • చెలువుఁగనునొ
తులసిపేరుల నంద • మొలుకు కంఠము మణి
భూషణాదుల నెంత • ముదమునిడునొ

వనములం దుండి నడుచుచు • దినదినంబు
పలువెతల నుర్కి దుంప లాకులు భుజించి
కలిమి విడనాడినను ముద్దులొలుకుమూర్తి
విభవముల నొప్ప నెవఁ డీతఁడు • త్రిభువనముల ?

వాసం—[ఆశ్చర్యముతో] సఖీ! చూడు, చూడు! వ్యాఘ్రము నెట్లెదు
లించుచున్నాఁడో !

సావి—చెలీ ! ఆ దుష్టశార్దూల మీ కుసుమకోమలుని గాసిపెట్టదు
గదా !

వాసం—అది గాసిపెట్టువఱకునా ?

ఉ॥ తోఁక పదానఁజుట్టువడఁ • దోరముగా మెయివెంచి నిప్పుకల్
వీఁక విలోకగోళములఁ • బెల్లు దొరంగఁగ బొబ్బరించుచుం
బాఁకులవోని కోఱలును • వాడినఖంబులు విస్తరిల్లఁ బై
దూఁకఁగఁజూచు నప్పులినిఁ • దూల్చె నతం డవలీల గొడ్డఁటన్.

సఖీ! ఈతని తేజోవిలాసములఁ జూడఁ దప్పక రాజపుత్రు
డనియే తోఁచుచున్నయది. ఇటు చూడుము.

సీ॥ వ్యాయామ మొనరించు•భంగి నుండియు సౌరు
సెలఁగు నాజానుబా•హులు వెలుంగ
ధనువుఁ బట్టుతెఱంగు • కనుపింప ముంజేతి
గుణకిణంబులు ప్రీతి•గొలుపుచుండ
సత్త్వగుణైకభూ•షణుఁ డీతఁ డను రీతి
శాంతి నెమ్మోమున • సంస్ఫురింప
సర్వసర్వంసహా•చక్రి మేలెడుభాతి
విభుచిహ్నములు మేన • వెలయుచుండ
బరశుపాశవిరాజిత•పాణి యగుచు
మౌనివేషవిభూషిత • మతనుఁ డనఁగ
స్వప్నగతుఁ డగు త్వన్మనః•పద్మభాను
యోజఁ గన్పట్టు ఘనుఁడు వి•ద్యుల్లతాంగి!

సావి—గోత్రనామంబు లెఱింగినఁగదా సంశయము తీరుట ?

వాసం—ఇటే వచుచున్నాఁడు. సంశయముఁ దీర్చెద.

సావి—వ్యాఘ్రహరణాయాసమైనఁ దీఱకమునుపే నీ ప్రశ్నలచే నా సుకుమారు నేల శ్రమపెట్టెదవు?

సత్య—[ప్రవేశించి] కాంతలారా! బెబ్బులి యంతమొందింపఁబడినది. భయమును విడనాడుఁడు

వాసం—ఆర్యా! యుపకారమును మేము మఱువనేరము.

సత్య—మీ రెవ్వరు? ఇచ్చటికి రాఁగత మేమి?

వాసం—ఈ నా ప్రియసఖి మదేశ్వరుఁడైన యశ్వపతిమహారాజు పుత్త్రి, సావిత్రి. మా యేలిక సకుటుంబముగ మునియాగమున కేగుచు నిచ్చటికి రాఁ దాపసీసందర్శనాభిలాషచే మా నెచ్చలి యిచ్చటికి వచ్చినది.

సత్య—ఈమె యభిలాష యెంతయుఁ గొనియాడఁదగినది కదా!

వాసం—దేవా! నా కొకకోరిక గలదు. దాని నెఱవేర్పఁ బ్రార్థించెద.

సత్య—అది యేద్ది?

వాసం—ఆర్యా! మీయెడ నాకారచేష్టల రాజభావమును, వేషమునఁ దాపసధర్మమును బొడఁగట్టుచున్నయవి. సంశయనివృత్తిఁ గావింపవేఁడుచున్నదాన.

సత్య—నేను రాజనందనుఁడ నయ్యును విధివశమున నంధులఁ దలిదండ్రుల సేవించుచు నిందే కాలము గడవుచున్నాఁడ.

వాసం—[జనాంతికముగ] సఖీ! సాభిలాషవు కమ్ము.

శ్యామ—[తెరలో] వాసంతికా! వాసంతికా!

సావి—సఖీ! చెలులు వచ్చుచున్న ట్లున్నది. పోదము రమ్ము.

వాసం—ఆర్యా! శీఘ్రకాలమునఁ బునర్దర్శనమునకై యాజ్ఞ యిందు. పోయి వచ్చెదము.

సత్య—అటులే కానిందు.

సావి, వాసం—[రెండడుగులు ముందునకు నడతురు.]

సావి—[స్మరణ మభినయించి] చెలీ! మఱచితి. పుష్పదామ మిం
యుండవలయును. జూడుము.

వాసం— ఔను. [అని యిద్దరు వెదుకుచుందురు.]

సత్య—[పుష్పమాలిక గ్రహించి] [స్వ] ప్రియురాలిచేఁ గూర్చ
బడిన యీపుష్పదామ మెంతహృద్యముగ నున్నది! [ప్రకా
కాంతలారా! ఇదిగో, మీపూలమాలిక. దీనిని గ్రహింపుఁడు
[అని పూలమాలను జూపును.]

సావి—[జనాంతికముగ] వాసంతికా! నీ వా పుష్పదామమును దీ
కొనుము.

వాసం—నే నేల తీసికొనవలె? ఎవరివస్తువును వారు గ్రహించుట
యుక్తము [అని సావిత్రిచెయి పట్టి గ్రహింపఁజేయును]

సావి—[సవిలాసముగఁ బుష్పమాల గ్రహించి వాసంతికతో నిష్క
మించును.]

సత్య—గీ॥ మొలకన వ్వొల్కఁ గొంచె మాం॰దలను వంచి
పూలమాలను గై కొని ॰ పువ్వుఁబోఁడి
ప్రణయసూత్రంబుచేత గుం॰భన మొనర్చి
యర్పణము సేసె నాకుఁ గం॰ఠాక్షమాల.

[సావిత్రి పోవుమార్గమువంకఁ జూచి]

గీ॥ తరుణి చెలివెంట నడచుచుఁ ॰ దిరిగి తిరిగి
యంతటంతటఁ గాంచుచు ॰ నరుగుచుండి
మేన వెదజల్లుచున్నది ॰ మొలఁత ప్రేమ
చూపు; చూపులో మదనుని॰తూపుగములొ.

[మఱలఁ జూచి] ఆహా! ఇక్కాంత యెంతలో నదృశ్య
రాలయ్యెను! పువ్వుఁదీవెలలోఁ బువ్వుఁదీవెయై, మావిగున్న
లలో మావిగున్నయై చంచలాలతికవోలె నామందయా
యిం దేకదా సంచరించె. ఆహా! నేను మేల్కొనియే యుం
నా? అస్పష్టమైన స్వప్నమందుం బోలె నా మనం బెచటిక
బోయినది తెలియఁ జాలకుందునా? [యోజించి] ఎచ్చటిక

యన నేల? మన్మనోమీనంబు హరించి యాతరుణి తన సౌంద ర్యజాలంబున నిడుకొనిపోయె. అందుచేతనే నాకు స్థైర్యము లేకున్నది. ప్రియురాలు సంచరించిన ఈ ప్రదేశములఁ జూచుచునైన నొక్కింత మనశ్శాంతినిఁ గావించుకొనియెద. [నడువలేమి నభినయించి] ఆహా!

సీ॥ దర్శనీయంబైన ♦ తరుణిరూపముతోడ
గదలెఁ జూ పన్యంబుఁ ♦ గనుట యెట్లు?
అమృతంబుఁ జిల్కు నయ్యతివపల్కులతోడ
వెడలె వీ నితరంబు ♦ వినుట యెట్లు?
లలనాశిరోమణి ♦ లలితావళులతోడఁ
బోమెఁ జిత్తం బొందు ♦ సేయు టెట్లు?
కువలయద్యుతిమీఱు ♦ కొమ్మచూపులతోడఁ
జనియె జీవము కాలుసాగు టెట్లు?
అక్షులును వీను లాత్మయుఁ ♦ బ్రాణములును
గలికితో నేగి సఫలతఁ ♦ గాంచెఁ బదము
నైనఁ గదపక కాయంబు ♦ వ్యర్థమయ్యె
నింద్రియంబులు లేనిమే ♦ నేమి సేయు?

[తెరలో] సత్యవంతా! సత్యవంతా! [అని మునిపుత్రులు పిలుతురు.]

సత్య—మిత్రులు వచ్చుచున్నట్టున్నది. వారితో నేగి మఱలఁ బ్రియురాలిని దర్శించెద. [అని నిష్క్రమించును.]

ఇది ప్రథమాంకము.

---



# సావిత్రీ నాటకము

## ద్వితీయాంకము.

[గృహోపవనప్రాంతమున శ్యామలా వాసంతికలు ప్రవేశింతురు.]

శ్యామ—సఖీ! వాసంతికా! మునియాగదర్శన మొనరించివచ్చిన మొదలు మన నెచ్చెలి సావిత్రి కృష్ణపక్షచంద్రికళవోలె నానాటికిఁ గృశించుచు గ్రంథపఠనాదులకుఁగూడ విముఖతఁ జూపుచుఁ బ్రణయప్రసంగములనైన నిచ్చలేక నిరంతరాలోచనా నిమగ్నయై కన్పట్టుచున్నది. దీనికిఁ గారణ మేమై యుండునో.

వాసం—ఆ నాఁ డాశ్రమప్రాంతమున నొక మనోహరాకారమున ముని వేషమున నున్న రాజయువకుఁ డీమెకు లోచనగోచరుం డయ్యె.

శ్యామ—ఔను! మననెచ్చెలులవలన నాతఁడద్భుతాకారుఁ డని వింటిని.

వాసం—ఆతని యద్భుతాకారమే మన నెచ్చెలి యవస్థకుఁ గారణము.

శ్యామ—అటులైన మన నెచ్చెలి ప్రణయధన మాతఁడు హరించెనా యేమి?

వాసం—లేదు. ఆమెయే సమర్పించి శూన్యహృదయయై కన్పట్టుచున్నది.

శ్యామ—అది యెట్లు?

వాసం—ఇట్లు—

మ॥ పలుమా రాతనిరూపవిభ్రమకళా ప్రాగల్భ్యవుం బాంశీతిక
బలుకుం దాఁ బలికించుఁ జిత్తరువునన్ వ్రాయించుఁ దా వ్రాయు
హ్వాలయా; నాతఁడు దుర్లభుండను; నిఁ కేలా జీవితంబంచును
ర్పులువుచ్చున్ దిశలంగనున్ దరుణి వ్యామోహాబ్ధినిర్మగ్నయై

శ్యామ—వాసంతికా! కేవలాకారవయోవిలాసములే అట్టి విదుషీ
మణిమనస్సు నాకర్షింప సమర్థము లగునా?
వాస—ఆతని సౌశీల్యాదులుగూడ నాకారానురూపములే!
శ్యామ—అటులైన వనవాసికదా!
వాసం—అందుచేతనే తలిదండ్రుల కనంగీకారమై మన ప్రియసఖియభి
ప్రాయమున కంతరాయము కలుగునేమో యని నామనస్సు
దిగులందుచున్నది.
శ్యామ—ఇది విచారణీయమే. అయిన మననెచ్చెలి యిప్పు డెచ్చట
ఏమిచేయుచున్నది?
వాసం—ఉద్యానవనమునందుండి యేమో లిఖించుచున్నట్టు వింటిని.
శ్యామ—ఈ సమయమున నచటి కేలపోయెనో?
వాసం—చిత్తస్థైర్యవిరహితులు సమయాసమయములను, స్థలాస్థలము
లను బరిగణింతురా?
శ్యామ—అటులైనఁ—గార్యసాధనకుఁ గడంగి సఖీధర్మమును నెఱ
వేర్చుకొనవలయును జుమీ! నీవు పోయి దేవీపూజకుఁ గావల
గిన పత్రిపుష్పాదులఁ గైకొని రమ్ము నే నేదేని మార్గాంత
రము యోచించెద.
వాసం—అట్లే కావింపుము. [ఇరువురు నిష్క్రమింతురు.]

[గృహారామమున సావిత్రి సత్యవంతుని చిత్రపటమును హృదయమున
నిడుకొని శయనించియుండును.]

శ్యామ—[ప్రవేశించి] ఇదిగో! నా ప్రియసఖి హంసతూలికాతల్ప
మును వదలినది. సఖీజనమును వర్జించినది. గ్రీష్మవాయు
వునకు వాడిన సహకారపల్లవముభాతి యధర మరుణిమ
శూన్యమై కన్పట్టుచున్నది. చూడఁజూడ నీ కోమలి మహత్తర
సంతాపసంతప్త యగుట విశదమగుచున్నది. ఈమె యెదుట
నున్న పట మేమి చెపుమా? [చూచి] ఓహో! నాసఖి తన
హృదయవల్లభుని మనోహరాకారము నీ పటమున లిఖించి
తదేకధ్యానమున నున్నవిధమునఁ గన్పట్టుచున్నది.

సావి—[చిత్రపటమును బుచ్చుకొని] హృదయేశ్వరా! నీ ముఖవిలా
నము, నీ నేత్రవైశాల్యము, నీ యవయవసౌష్ఠవము అద్వి
తీయములే! నిన్నా విరించి యెట్టి సుందరవస్తువులచే నిర్మించెనో
తెలియఁజాలకుంటినే! [అని చిత్రపటముఁ జూచుచుండును.]

శ్యామ—ఆహా! నా నెచ్చెలి యనురాగలతిక యెంతదూరము వ్యాపిం
చినది! [ప్రకా] సఖీ! సఖీ! [అని పిలుచును.]

సావి—శ్యామలా! నీ వెప్పుడు వచ్చితివి?

శ్యామ—ఇప్పుడే. కాని, యీతఁ డెవ్వఁడు?

సావి—ఇతఁడు నా మనోహరుఁడు. స్వప్నమున సాక్షాత్కరించె
ఋష్యాశ్రమప్రాంతమున నయనానంద మొదవించె. శ్యామలా
జడలుకట్టిన యాకురులు కపోలములపై నెట్లు వ్రేలాఁడు
చున్నవో చూడుము. సఖీ! నే నెన్నిమాఱు లెంత యత్నించి
వ్రాసినను అందొకశతాంశమైన నీమూర్తికనబడుటలేదుగదా!

శ్యామ—చెలీ! ఆ కావివలువలు, ఆ విభూతిరేఖలు, ఆ రుద్రాక్ష
మాలలు, ఆ గండ్రగొడ్డలియేనా నీ భ్రాంతికారణములు!
ఆహా! మోహ మెంతకుఁ జాలదు! మాధవీలత తియ్యమామిడి
గున్నపైనిఁ బ్రాఁకఁదగునుగాని, బూరుగుచెట్టుపైఁ బ్రాఁకుట
యుక్తమా?

సావి—శ్యామలా! అట్టి సౌందర్యము, అట్టి సత్ప్రవర్తన మొదైన
గలిగియుండునా?

సీ॥ రాజ్యరాహుగ్రహ • గ్రహణంబునకుఁ బాసి
రాజిల్లుచుండెడి • రాజరాజు
ప్రకృతిబాంధవమేఘ•పటలంబునకుఁ దప్పి
ప్రజ్వరిల్లుచునుండు • భానుమాలి
ప్రాభవాభోగ వం•ర్షసూర్తిఁ జిక్కక
రంజిల్లుచుండెడి • రాజహంస
విషయపరంపరా • విషమస్థితులఁ ద్రోలి
తేజస్వియా శమి•రాజమౌళి

ప్రణుత పితృ పాదపద్మ సే॰వావినోద
దీవ్యదానంద రసవార్ధిఁ ॰ దేలువాఁడు
మహితచారిత్రుఁ డిఁక వేయి॰మాట లేల?
యద్వితీయుండు మన్మనో॰హారుఁడు సకియ!

శ్యామ—చెలీ! నీ వెంత చెప్పినను సుక్షత్రియులకుఁ బరాక్రమ మలంకార మైనట్లు తదితరములు కానేరవు సుమీ!

సావి—సఖీ! ఎంత నెఱ్ఱిదానవు; ఎఱుఁగవా యేమి?

మ॥ అభయంబిచ్చెడునాఁడు ప్రాణులకు మ॰ర్త్యామర్త్య లేతెంచిదో
ర్విభవంబొప్పఁగఁ బోర నిల్చిన జయ॰శ్రీఁ బొందువాఁ డన్యదు
ర్లభచారిత్రుఁడు స్వర్గమైనఁ గొని యే॰లం జాలువాఁ డర్కస
న్నిభ తేజుం డనఘుండు వేఱుగతిగా ॰ నీ వెంచెదే శ్యామలా!

శ్యామ—[స్వ] ఈమె హృదయక్షేత్రమునఁ బ్రణయవృక్ష మెంత గట్టిగ నాటుకొన్నది! [ప్ర] సఖీ! నిరంతర చంద్రకాంతమణి సౌధసంచారిణివి; అందును గనుకందు శిరీషకుసుమపేశల గాత్రివి; పరిచారికా సహస్ర సంసేవ్యవు; నీవెక్కడ? వనవాస మెక్కడ?

సావి—చెలీ! మునిజనాదరణపాత్రుఁడై సత్యవంతుఁ డని ప్రసిద్ధిఁ గాంచిన పితృసేవాతత్పరునికంటె వేరు సుచరిత్రుఁ డుండునా? అట్టివానినిఁ బతిగాఁ బడయుటకంటె రాజ్యవైభవాదు లెక్కుడగునా?

శ్యామ—సఖీ! ఇంతటి దృఢచిత్తముగల నీకు నీ యభీష్టము తప్పక నెఱవేఱఁ గలదు.

సావి—అందులకే సంశయించు చున్నదాన.

శ్యామ—ఎందుచేత?

సావి—శ్యామలా! నిక్కముగ నాతఁడు దుర్లభుఁడు సుమా!

ఉ॥ ఆ నవమోహనాంగుని యయో॰యారముగర్ సుగుణాళి లేశమున్
లేని నను గ్రహించునని ॰ నెమ్మది నూరట పల్కుచుంటి వా
హా! నిజమెన్న హస్తిమశ॰కాంతరమున్నది మాకు; నక్కమెం
దేనియు స్వర్గమేగునఁటె! ॰యెంచునెమోహముతారతమ్యముల్?

శ్యామ—అంబరవిహారియైనవు భాస్కరుండు పద్మినీప్రియుఁడు కాఁడా! ఎంత బేల వగుచుంటివి? సఖీ! ఆతఁడు నిన్నుఁ జూచెఁగదా!

సావి—చూచిన?

శ్యామ—నీ యభీష్టము నెఱవేఱిన దనుటయే!

సావి—అది యెట్లు?

శ్యామ—గీ॥ చూచినం జాలదే నీదు ♦ శుభ్రవదన
మనమశరుఁడేని వదముల ♦ న త్తమిల్లు
నమృతకరుఁ డంద సుధఁ దాగ్రివ♦నట్టివాఁడు
కలుగునే? యెచ్చటేనియుఁ ♦ గమలనేత్రి!

సావి—చెలీ! ఇంక నాయభిప్రాయ మాతఁడెఱ్ఱెలుఁగఁ గలఁడు? దయారసంబుఁ జిల్కు వీక్షణాంచలముల నాపై నెప్పుడు ప్రసరింపఁ జేయఁగలఁడు? నే నెట్లు ధన్యురాలను గాఁగలను? ఇం కెట్లు జీవింపఁ గలను? [అని కనులు మూసికొనును.]

శ్యామ—ఇపు డేది క ర్తవ్యము? వాసంతికకూడా లేదుకదా!

వాసం—[ప్రవేశించి] శ్యామలా! మన నెచ్చెలి నిద్రించుచున్నదా?

శ్యామ—నిద్దుర యెక్కడ? ఆ సత్యవంతునిమీఁదదృష్టి తప్ప వేఱు ప్రపంచమే లేదు. ఇంక మన మాలసించినఁబ్రయోజనము లేదు.

వాసం—అయిన క ర్తవ్యము?

శ్యామ—సఖిమనోభీష్టము నెఱవేర్చుటయే.

వాసం—నెచ్చెలిమనంబు త్రిప్పలేక పోతివా?

శ్యామ—నాకే కాదు; ఈశ్వరునకైనను సాధ్యముకాదు. ఈమెశరీరమును జూడుము; ఎంత వెచ్చగ నున్నదో. [అని చేయిపట్టి చూపును.]

వాసం—[స్పృశించి] ఇఁక మన ముపేక్షింపరాదు. నీవుపోయి మాళవీదేవి యేమి చేయుచున్నదో చూచిరమ్ము. నే నొకింత మన సాన్వస్థ్యము సమకూర్చెద.

శ్యామ—అటులనే కావింపుము [అని నిష్క్రమించును.]

వాసం—ప్రాణసఖీ! ప్రాణసఖీ! లెమ్ము. లెమ్ము. త్వరపడుము. త్వరపడుము.

సావి—వాసంతికా! నీవును నాపైఁ బగఁబూని యొంటిగ నీయడవి పాలు చేయవలెనా?

వాసం—సఖీ! ఒంటిగనే యుంటివా?

సావి—మఱియేమి?

వాసం—లేఁడా?

సావి—ఎవరు?

వాసం—నీ మనోహరుఁడు సత్యవంతుఁడు.

సావి—ప్రాణసఖీ! ఎక్కడ, యెక్కడ? [నలుదిక్కులు చూచి] వాసంతికా! ఎందును గానరాకుండెనే? యిది పరిహాసము కాదుగదా!

వాసం—ఒడిలో వస్తువు నుంచుకొని యూరెల్ల వెదకినట్లు నిజనాథుని దగ్గఱ నుంచుకొని యటు నిటుఁ జూచినఁ గనఁబడునా?

సావి—చెలీ! దగ్గఱనే యుండెనా? [మఱల నిరుప్రక్కలఁ జూచును.] చెలీ! ఇంత పరియాచకమా?

వాసం—సఖీ! పరిహాసమాడుదునా?

సావి—కాక యిది యేమి?

వాసం—అట్లయిన నీతఁ డెవ్వఁడు? [అని చిత్తరువును జూపును.]

సావి—ఇతఁడు నా మనోహరుఁడే.

వాసం—అట్లయిన నాయొనర్చిన పరిహాస మేమి కలదు?

సావి—వాసంతికా! చాలుచాలు, నీ చెలిమి. నా మనోనాయకుని మనోహరాకారమును జిత్రపటమున వ్రాసి చూచుకొనుచున్నందులకా, హాస్యము చేయుచుంటివి? నీపనికి నీవు పొమ్ము. ఇఁక నాదగ్గర నుండకుము. అయ్యో! ప్రాణములకన్న నెక్కుడగు నెచ్చెలికిఁ గూడఁ బరిహాసాస్పదమ నైతినే! ఇం కేమి చేయుదును? నా యభీష్ట మెట్లు నెఱవేర్చుకొందును!

వాసం—చెలీ! నీ మనోనాయకుండు చిత్రగతుఁడై నేఁడు నీదరి నున్నట్టు కొలఁది దినములలోఁ గరగ్రహణమొనర్చి నీ యభీష్టము నెఱవేర్పఁగలఁడు.

సావి—వాసంతికా! ఊరకుండుకొలఁది హాస్యముతోఁబాటు కల్లపె
ల్లూరడింపులు మొదలు పెట్టితివా? ఇం కేమనఁగలను? ఇఁ
నాతో మాట్లాడకుము. [అని ముఖ మావలఁ దిప్పుకొనును
వానం—రాజపుత్రీ! కోపపడకుము దయయుంచుము. [మీఁద
జేయివేసి] నెచ్చెలీ! ఎంత పిచ్చిదానవమ్మా! నా బహి
ప్రాణమ వయిన నిన్ను పరిహసింతునా? అసత్య మాడుద
ననుకొంటివా? పరిహాసము కాదు. నిజము. కొలఁది దినమ
లలో నీ మనోహరునిఁ జేపట్టఁ గలవు. ముమ్మాటికి నిశ్చ
యము.
సావి—నఖి! ఎట్లు తెలిసికొంటివో చెప్పినఁగాని నేను నమ్మఁజాల.
వాసం—పుష్పములు గోయుచు నీ మనోభీష్ట మెట్లు నెఱవేఱునా
యని చింతించుచుండ ఇప్పుడే నీ జనకుని కడ కరుగుదెంచ
త్రిలోకసంచారి యగు నారదుని సందర్శించితిని.
సావి—నెచ్చెలీ! దివ్యమునిసందర్శనమున నీవు కడుంగడు ధన్యురా
లవు సుమీ! పిమ్మట నేమి జరిగినది?
వానం—నే నామౌనివర్యునకుఁ బాదాభివందన మొనర్చి నీవిషయమై
ప్రశ్నింప నీ యభీష్టము తప్పక ఫలించునని చెప్పి యాస్థా
మున కరిగెను. దేవఋషివాక్యములు నిశ్చయమని యెంచి
యిట్లు పలికితిని అన్యథా తలంపకుము. నీ మనోభీష్టము తప్పక
నెఱవేఱును.
సావి—నఖి! నీ యుపకారము మఱవఁ జాలను. నీ మనం బెఱుఁగక
కోపించిన నాయపరాధమును మన్నింపుము. [అని గడ్డము
బుచ్చుకొని బ్రతిమాలును.]
శ్యామ—[ఆతురతతోఁ బ్రవేశించి] నెచ్చెలులారా! త్వరపడుఁడు,
త్వరపడుఁడు.
వానం—ఎందులకు?
శ్యామ—ఆస్థానమున కరుగుదెంచిన నారదమునీంద్రునిఁ దోడ్కొ
కొత్తగఁ గట్టించిన దేవళమును జూపుచు రాజదంపతు లిట
వచ్చుచున్నారు.

వాసం—సఖీ! మొక్కఁబోవుదైవ మెదురయ్యె.

సావి—నెచ్చెలులారా! పీఠముల సిద్ధపఱుపుఁడు.

చెలులు—అట్టులనే [ అని పీఠముల సవరించుచుందురు. ]

అశ్వ—[ తెరలో ] దేవా! ఇటు, ఇటు. [ అని అశ్వపతి త్రోవఁ జూప నారదుఁడును మాళవియుఁ బ్రవేశింతురు. ]

సావి—జననీజనకులారా! నమస్కారము. ఋషిచంద్రమా! యభివాదము.

నార—మనోవాంఛాఫలసిద్ధి రస్తు.

శ్యామలా—, వాసంతిక— } మునివర్యా! నమస్కారము.

నారా—కల్యాణం భూయాత్, కల్యాణం భూయాత్.

సావి—దేవా! ఈ పీఠము నలంకరింపఁజేయుఁడు. జననీజనకులారా! యిటు దయచేయుఁడు. [ అందఱు కూర్చుందురు. ]

శ్యామ—, వాసం— } నారదునకు వింజామరలు వేయుచుందురు.

అశ్వ—కుమారీ! ని న్నొకటి నే నపేక్షించుచున్నవాఁడ. నా కోరిక నెఱవేర్పుము.

సావి—మీ యాజ్ఞను శిరసా వహించెద.

అశ్వ—నే నీ ప్రపంచమునంగల రాజనందనులచిత్రపటములఁ దెప్పించితి. వీనిం జూచి నీ వయోరూపసంపదలకుఁ దగినవానిని వరింపుము.

సావి—[ సిగ్గు నభినయించును. ]

అశ్వ—వాసంతికా! చిత్రపటముల నీ నెచ్చెలికి వేఱువేఱుగఁ జూపింపుము. [ అని చిత్రపటముల నిచ్చును. ]

నార—కుమారీ! సంశయింపకుము. కన్యలకు స్వయంవరమే ముఖ్యము గాన నీ యభిప్రాయమును దెలియఁజేయుము.

సావి—ఋషిచంద్రమా! మీ రెఱుఁగని రహస్యము లుండునా?

వాస—సఖీ! ఈపటమును జూడుము. [ అని పటమును జూపును. ]

సావిత్రి—
శ్యామల— } [ చూచుట నభినయింతురు. ]

సావి—[జనాంతికముగ] శ్యామలా! నామనోహరుఁడు ముని వేషమున నుండుటచే నిందుండుట దుర్లభము. అందున్న పటమును దెమ్ము.

శ్యామ—[ ఆవల కేగును ]

వాసం—[ చిత్రపటములను జూపుచుండ సావిత్రి తిరస్కారభావమును జూపుచుండును. ]

శ్యామ—సఖీ! ఇదిగో దీనిని గ్రహింపుము. [ అని యిచ్చును. ]

సావి—[ కనుల నద్దుకొని ] వాసంతికా! దీనిని జనకున కిమ్ము.

వాసం—[ పటమును గ్రహించి యశ్వపతి కిచ్చును. ]

అశ్వ—[ చిత్రపటమును జూచి ] ఆహా! ఏమి యీ యకృతిమవిలాసము? దేవీ! ఈచిత్రపటము జూడుము. [ అని చూపించును. ]

మాళ—రూపతేజంబు లసామాన్యముగ నున్నను, మునిబాలకుని వలె నున్నాఁడే?

అశ్వ—అమ్మా! ఈతని నెక్కడఁ గాంచితివి?

సావి—[ వాసంతికను జెప్పు మని సంజ్ఞఁ జేయును. ]

వాసం—ఈ మహాభాగుఁడు మొట్టమొదట స్వప్నమున సాక్షాత్కరించె. అప్పుడే నా నెచ్చెలి —[ అర్థోక్తిచే విరమించును. ]

అశ్వ—[ చిఱునగవుతో ] అమ్మా! ఎంత వెఱ్ఱిదానవు! తాపసేంద్రా! యీ చిత్రగతపురుషునియందుఁ గొన్ని సంశయములు వొడముచున్నవి. వాని నివారింపఁ బ్రార్థించెద.

ఉ॥ రూపవిశేషమున్ వయసు • ప్రోఢతనంబును మేనిచిన్నెలున్
క్ష్మాపతిపుత్త్రుఁడంచు సను•మానములేక వచించు వేషమున్
మూఁపున గండ్రగొడ్డలియు•ముద్దుకరంబునఁ దాల్పుఁ జూడ న
తాపసిపట్టియో? యనుచుఁ•దప్పకతోఁచెడు, మానిచంద్రమా!
కావున, నీతనిగుఱించి నవిస్తరముగ సెలవీయఁ గోరెద.

నార—రాజేంద్రా! ఈ చిత్రగతపురుషుఁడు రాజ్యభ్రష్టుఁడై యడవి యందున్న సాళ్వదేశాధిపతియగు ద్యుమత్సేనపుత్రుఁడు కాని, మునిపుత్రుఁడు కానేరఁడు.

అశ్వ—[స్వ] ఆహా! మహారాజపుత్త్రికను జిట్టచివరకుఁ గాననవాసి కీయవలసివచ్చునా యేమి? కానిమ్ము. [ప్ర] దేవా! రాజపుత్రుని విద్యాబలపరాక్రమాదులఁ దెలియఁజేయుఁడు.

నార—ఈతం డఖిలవిద్యావిశారదుండై, నిరుపమానసౌందర్యరాశియై, బాహుబలసమగ్రుఁడై, మాతాపితృసేవా పరాయణుఁడై, సర్వదా సత్యాసక్తుఁడగుటవలన సత్యవంతుం డని పేరు వడసిన చిత్రాశ్వనామధేయుఁడు. యోగ్యతములయం దగ్రగణ్యుఁ డనుట కెంతమాత్రము సంశయములేదు. రాజ్యభ్రష్టుఁడగుట వలన నంధులఁ దలిదండ్రుల సేవించుచు నడవులయందే కాలముఁ గడపుచున్నాఁడు.

అశ్వ—అమ్మా! ఈ మహామునివాక్యములు వింటివిగదా! అరణ్య వాస మెంత దుర్భరమో విచారించుకొనుము. వే రొక మహా రాజపుత్త్రుని వరించి సర్వసౌఖ్యము లనుభవింపుము.

మాళ—అమ్మా! చూచిచూచి యేల కష్టములపా లయ్యెదవు? తండ్రిగారి యభీష్టముఁ దీర్పుము.

సావి—జననీ! వనవాసమునకై విచారించుచుంటివా?

మాళ—తల్లీ! అంతకన్న కష్ట మున్నదా? అందును నీవంటి కుసుమ కోమలికి వేఱుగఁ జెప్పవలయునా?

గీ॥ మృదుమృణాళాంకురంబుల • మెసవుచుండి
వీచికాడోలలందున • వేడ్కనుండు
రాజహంసికిఁ బద్మాక•రంబె హితవొ
యడుసుగుడుసులఁ బడు నూరి•మడుఁగె హితవొ?

సావి—జననీ! నేను కష్ట మందుదునని తలంచుచుంటివిగాని నీ వెఱుఁ గని ధర్మ మున్నదా?

మ॥ కలుగుంగాక పరస్సహస్రములు న•క్షత్రంబు లామింట రా
త్రులఁ జీఁకట్ల నడంపఁజాలునది చం•ద్రుం డొక్కఁడేకాదె? కాఁ

తలఁకగ సంపద లెన్నియున్నఁ బతియే • దైవంబు, త త్సేవచేఁ
గలుగఁగ రానిది కల్గునే ? తుదకు మోక్షంబేని చేకూరదే ?

జననీజనకులారా ! సంపద లెప్పుడు స్థిరములు కానేరవు. రత్నసౌధములయం దున్నను నాభర్తకు నాయత్తమామలకు నిరతసేవకురాలనే; కాన వనవాసమునకై విచారింపకుఁడు.

మాళ—లోకవృత్త మెఱుంగని ముద్దరాల వగుటచే ని ట్లనుచుంటివి గాని, పరిచారికాగణముచే నిఖిలోపచారములు గై కొను నీ వా వనవాసక్లేశ మనుభవింపఁ గలుగుదువా ? కుమారీ !

సీ॥ జిలుఁగు రాయంచయం•చుల చీర ధరియించి
ధరియింతువే నార•తడప చీర
వెలలేని రతనాలు • జెలఁగు భూషలు వేసి
వేయనేర్తువె గురు•వెందమాల
పరిమళించెడు మంచి • పన్నీరులం దోగి
తోఁగుదే పెనుగొండ•వాఁగులాదు
నెలఱాలమించు మేఁ•డలయందుఁ జరియించి
చరియింతువే వట్టి • మొరపనేల
అమృతతుల్యాన్న భక్ష్యభో•జ్యములఁ దేలి
సకలసౌఖ్యంబులను బొంది • సంతసించు
బాల వీవేడ కానన•బాధ లేడ
కాన నీపట్టు విడు నన్నుఁ • గన్నతల్లి !

అశ్వ—లేకలేక కలిగిన సంతాన మనియు, నీ వేమో మ మ్మొద్ధరింతు వనియుఁ గొండంత యాసతో నుండఁ గోరక కోరక యరణ్య వాసమును గోరి మ మ్మలజడిపాలు గావించెదవా ?

శా॥ నెయ్యం బొప్పఁగఁ బెంచి సర్వకళలం • నేర్పించి శ్రీమంతుతో
వియ్యంబుం దగఁజేసి కూతుసుఖముం • వీక్షింపనాగాని క
న్నయ్యల్ కూడునుగుడ్డలేక వని దై•న్యం బందు రాపట్టికా
యియ్యంజూచుట? యింతవింతకలదే • యొంధైన నో పుత్త్రికా !

నార—[స్వ] ఇప్పు డేమి సమాధానము చెప్పుదునో ?

సావి—జననీజనకులారా! మీపుత్రికాప్రేమము ధర్మహానికిఁ గూడ జంకనీయుట లేదుగదా! అననుకూల పతిసేవ, క్షుద్రదేవతా రాధనమువోలె నపాయకరమని చెప్పిన మీమాటలైన మీకు స్మరణకు లేకున్నవే? ధర్మమూర్తులని ప్రసిద్ధిఁగాంచిన మీరే యిట్లుపలికిన వేదశాస్త్రములఁ దలపెట్టువా రెవరు? మంచి చెడ్డల విచారణ మేల? మనమునఁ బతిఁగాఁగోరి వదలుట కంటెఁ బ్రాణత్యాగము మేలు కాకుండునా?

నార—[స్వ] ఆహా! ఏమి యీమె మనోనిశ్చలత్వము. జగన్నుతముగా నున్నదే! [ప్ర] అమ్మా! కాలవశమున భర్తకేమైన నాపద వచ్చిన నీ వెట్లు తప్పించుకొనఁ గలవు?

సావి—మహాత్మా! నామనం బరయఁగోరి యిట్లనుచుంటిరి కాని యాపద లడవినున్న వచ్చి, యంతిపురినున్న రాకుండునా?

నార—అపాయమన్న నేమిగాఁ దలంచుచుంటివో? ప్రాణాపాయమే వచ్చిన నేమి చేయుదువు?

సావి—[దైన్యముతో] అమంగళము ప్రతిహత మగుఁగాక! అమంగళము ప్రతిహత మగుఁగాక!

మాళవ్యశ్వపతులు—[విచారము నభినయింతురు.]

సావి—[స్వ] ఆహా! నా యాశాలతిక మొదలంటఁ దెగుచున్నదే! ఇంకేది గతి! [యోజించి] అయ్యో! నాకల్పవృక్షము గంటువారునా? నామేరుమహీధరము నీర మగునా! హా! హా! హతవిధీ! హతవిధీ! ఎట్టి యిక్కట్టు నమకూర్చితి? [అని విచారపడును.]

అశ్వ—మునిచంద్రమా! ఇది యేమి ఘోరము? వనవాసమునకే విచారించుచుండ నీదుర్వార్త విని యెట్లు ప్రాణముల భరింతుము? అమ్మా! సావిత్రీ! ముని వాక్యముల వింటివిగదా! చిరకాలము తపం బొనరించి యా జగదంబ కృపచే నిన్నుఁ గాంచి మా సర్వసౌభాగ్యములు నీవిగాఁ దలంచి సంతసించెడు మా కింత సంతాప మొదవించెదవా? తల్లీ! నామాట వినుము. ఒక్క స్థిరజీవునిఁ గోరుకొనుము. మా హృదయతాప మపనయింపుము.

మాళ—కుమారీ! పట్టులేని కొమ్మ కేల పాకెదవు? పాముకొఱకు ఫలము నేల తినెదవు? తల్లీ! ఇంక నీ పట్టువదలి మా ప్రాణములఁ గాపాడుము?

సావి—[స్వ] ఇం కేది కర్తవ్యము? [యోజించి] మునీంద్రా! ఇది నిక్కమా? నన్నుఁ బరీక్షింప నిట్లనుచుంటిరా?

నార—అమ్మా! కాలగతు లెవ్వరు నిర్ణయింపఁ గలరు?

అశ్వ—కుమారీ! ఇది మహానర్థకరమే కాకున్న నాగతానాగతవేది యగు నిమ్మహాత్ముఁ డిట్లు పలుకునా? అమ్మా! ఇంక సత్య వంతుని మాటఁ దలపెట్టకుము.

సావి—[స్వ] ఆహా! ప్రణయలతికను ద్రెంపక వీరి నెట్లు లొప్పింపఁ జాలుదును? మోహబంధమును విప్పక యెట్లు సుఖింపనేర్తు? [యోజించి] ఏమి నావెఱ్ఱి! ఎంతటి యంధురాల నగుచుంటిని! ఎంతటిసాహసమునకుఁ బాల్పడుచుంటిని! అపదలేకాదు, ఇంకే మైననుసరే, నాప్రేమకుఁ గళంకము గలిగింపను. నాచరిత్ర మపవిత్ర మొనరింపను. నాహృదయాశ్వము నపమార్గము నకు దింపను. [ప్రకా] జననీజనకులారా! నాకై మీరు విచా రింపకుఁడు. నా యభీష్టమున కంతరాయమును గల్పింపకుఁడు.

అశ్వ—తల్లీ! కార్చిచ్చుపైఁ గాలు పెట్టెదవా?

సావి—తండ్రీ! కులశీలముల భంగపరచుట యుక్తమా?

మాళ—కుమారీ! కన్నకడుపు విషముగ్రోలుచుండఁ జూడఁగలమా? వేఱొకని వరింపుము.

సావి—జననీజనకులారా! విధి బలవత్తరముగ నున్న నింకొకని వరిం చిన మాత్రమున మేలు కలుగునా? అదృష్టమున్న నా పతి కపాయము తొలగఁగూడదా?

మాళ—అమ్మా! ఎంత వెఱ్ఱిదానవు?

సావి—జననీ! లోకవృత్తమును కనుంగొనుము.

గీ॥ అస్తమయదోష మున్న దం • చాత్మ నెఱిఁగి
భాస్కరు వరించు పద్మినీ•పద్మగంధి

భర్తసుఖదుఃఖములఁ బాలుపంచుకొనుచు
నిత్యసౌభాగ్యవతి యగుచు నెగడఁగాదె!

అశ్వ—[స్వ] ఇం కేమిచేయుదును? మునీంద్రా! మీరైన నీమె భావ
మును మఱలింపుఁడు.

నార—సావిత్రీ! జననీజనకుల కేల వ్యతిరేక మొనరించెదవు?

సావి—దేవా! జననీజనకులకుఁ గాదు, నా మనోనిశ్చయమునకు
వ్యతిరేక మొనరింపఁజాల.

నార—రాజపుత్రి! చెప్పుట కాదు; ఎద్దియైనఁ జేయుట దుర్లభము
సుమా! వెనుక ముందులు విచారించి చెప్పుము?

సావి—దేవా! విచారించియే కాదు, నిశ్చయించియే చెప్పుచుంటిని.

నార—ఎట్లు?

సావి—

మ॥ పతిభక్తిన్ నిఖిలార్థసాధకముగా • భావించెదన్; నాదు జీ
వితమం దర్థము మన్మనోహరునకై • వెచ్చించెదన్; లేనిచోఁ
బతితో నేగి దివంబునం దతనిసే•వల్ సేయుదున్; గాని నే
నితరుం గోరను దథ్య మింత నురమా•నీ! యేటి కిం కన్యముల్?

నార—[స్వ] ఔరా! ఈమె మనోనిశ్చలత్వము ప్రశంసనీయముగ
నున్నదే!

అశ్వ—సావిత్రీ! ఇదియే నిశ్చయమా?

సావి—జననీజనకులారా! నిశ్చితాభిప్రాయ మాకర్ణింపుఁడు.

మ॥ అవనీశుల్ వినుతింపఁగాఁదగుమహా•హార్యాశ్వ్యదులన్, రాజ్యవై
భవమున్ బాసి వసిన్ వసించిన, నిఁకే•బన్నంబు ప్రాప్తించినన్
భువనాతీతగుణోత్తరున్ సుగుణవం•ద్యున్ సాళ్వరాట్పుత్త్రు నే
ధవుఁగాఁ గోరితి; నిందు సాక్షియగుఁగాం•తన్ దేవి సావిత్రియున్.

అశ్వ—దేవీ! ఇంక మన మే మనఁగలము? [అని విచారముతో నుందురు.]

నార—[స్వ] ఈమె మనశ్శుద్ధి దేవతల నయితము మెప్పించు ననుటకు సందియములేదు. ఇంత దృఢచిత్తముగల యీమె కొక్కింత సాహాయ్యము చేసెదఁగాక! [జనాంతికముగ] అశ్వపతీ! విచారింపకుము. సావిత్రీ మూలమునఁ బతి కాపద తొలఁగి యుభయకులము లుద్ధరింపఁబడును. [ప్రకా] మహేశ్వరా! వివాహప్రయత్న మొనరించి సావిత్రీ మనోభీష్టము నెఱవేర్పుము.

అశ్వ—ఆజ్ఞానుసారమే ప్రవర్తించెద.

నార—[జనాంతికముగ] బిడ్డా! సావిత్రీ! వివాహమైన సంవత్సరమునకు నీ భర్త కొక యాపద వచ్చునేమో యని తోఁచెడిని. నీపైఁ గల యనురాగాతిశయమున నీ కొక మంత్ర ముపదేశించెద. త్రిరాత్రోపవాస మొనరించి దానిని జపించి సావిత్రీదేవి నర్చించిన దూరదేశగమనము, దివ్యపురుషసందర్శనము లభింపఁగలవు. మంత్రము నుపదేశించెద రమ్మా.

అశ్వ—దేవా! దేవీపూజవేళయైనది. దయచేయుఁడు.

[అందఱు నిష్క్రమింతురు.]

ఇది ద్వితీయాంకము.

---



# సావిత్రీ నాటకము

## తృతీయాంకము.

[ వనప్రాంతము—సత్యవంతుఁడు ప్రవేశించును.]

సత్య—[స్పర్శనభినయించి] ఏమి! ఈమలయానిల మిట్లగుచున్నది? ఒక్క మలయానిలంబేమి, ప్రకృతియంతయు నిట్లే కానవచ్చుచున్నది.

చ॥ చిలుకలు పల్కినన్ గలఁగుఁ జిత్తము; కోయిల పాటబాడినన్
దొలఁగును ధైర్యకంచుకము; తోయజశత్రుఁడుశత్రుఁడౌ; లతా
వళులను లేఁ జివుళ్ళఁ బువుఁబంతులఁజూచిన నేవపుట్టు; నే
కలన మనఃప్రశాంతి కలుఁగంగలదో; విధి యెట్లుచూచునో?

అకటకటా! ఆతరుణి తారుణ్యలత నాహృదయమున నాటుకొని పుష్పపల్లవోల్లసితంబై పెచ్చుపెరిఁగియుండ నింక నే పువ్వులు తీవెలు నాకింపు గలిగించును? ఆ యువతీరత్నము కనుల కగపడుటయేగాక శ్రోత్రప్రేయమగు స్వప్నవృత్తాంతమును గూడ వినిపించెనే? అందును జెలి యెంత చెప్పినను వినక స్వప్నగతపురుషునే వరించెద నని గట్టిగఁ బట్టుఁబట్టెనే! నన్నే వరించితి ననుటతప్ప యాస్వప్నగతపురుషునకును నాకును భేదమావంతయుఁ గానరాదుగదా! ఆసతి కలువరేకులు చల్లినట్లు లపాంగప్రసారణముల ముంచె నని సంతసించితిని గాని వాని యందింతవేఁడి యున్నదనియుఁ, బిమ్మట నిట్టి యవస్థను గల్పించుననియుఁ దలంపకుంటినిగదా!

సీ॥ బలితంపు గాలంబు పడఁద్రిప్పినట్టు ల
తరళాక్షిచూపు చిత్తముఁ గలంచు

మోహనాస్త్రవుమంత్రి•ముల శక్తినిం బలె
నవ్వెలందుకపల్కు • లవశుఁ జేయు
సరసనత్కవికావ్య•సారస్యమట్టు ల
త్తరుణిరూపితరంబు • మఱవఁజేయు
కళ్ళెంబు బిగఁబట్టి • కదలనీనట్టు ల
క్కొమ్మలావణ్యంబు • కుదియఁబట్టు
అదను గనిసొచ్చి ధైర్యంబుఁ • జిదిమివైచి
హృదయముఁ బెకల్చి ప్రాణాశ • వదలఁజేయు
వదనుదీరిన యంబుల•పొదులు గావె
మదవతీవిభ్రమంబు ల•మ్మదనునకును ?

ఎం దున్నను ఆ జగన్మోహనాకార మెల్లప్పుడు కనులఁగట్టినట్టు లుండుఁనుగదా !

సీ॥ క్రిమ్మఁ బుప్పొళ్ళు చే•లమ్ము దుఃప్పచుఁ గన్న
లద్దుచు నఱఁజూచు • నట్టి తళుకు
స్వప్నంబు తన యిష్ట•నఖికిఁ జెప్పెడువేళఁ
బొలఁతి గండంబులఁ • బొడము పులక
లటఁ బులిరాశకై • యడరి న న్గని స్వప్న
గతునిగ భావించి • కాంచు సొబగు
పులిఁ దూల్చి నే రాజ•పుత్త్రుఁడ నని పల్కఁ
బరికించి యాణెన్వ • పడిన సిగ్గు
పుష్పమాలికఁ గైకొనఁ • బూనినపుడు
వెలఁది యొలికించు దరహాస•వీక్షణములు
మదనసంతాపమునఁ దూలు • మామకీన
భావలతికకు దోహద•ప్రాయ మయ్యె.

ఆ రమణీమణిదర్శనభాగ్య మెట్లు లభించును ? ఎట్లు మ
శ్శాంతి కలుగును ? ఆహా ! ఏమి నావెట్టి !

సీ॥ కాంచనాబ్జము కాఱు•కానయం దుండునే
గగనాపగాతరం•గములఁ దక్క

రత్నదీపము పర్ణ • రాశి రాజిల్లునే
మహనీయరమ్యహ • ర్మ్యములఁ దక్క
అంచకొదమ దిన • నెంచునే ముస్తలఁ
గమనీయమృదుమృణా • ళములఁ దక్క
శశిరేఖ మలినుఁడౌ • శబరుని తల నున్నె
శివజటాకోటీర • సీమఁ దక్క
సంతతానందభోగ • ప్రశస్తిఁ గాంచి
యతులవై భవయుక్తమైన • యతివ యేడ!
వల్కలముఁ దాల్చు ని వ్వన • వాసి యేడ!
యంత ముందునె యాసల • కవనిలోన?

శారద్వతుడు—[తెరలో] మిత్రమా! సత్యవంతా! సత్యవంతా!

సత్య—అదిగో, మిత్రుఁడు శారద్వతుఁడు పత్రపుష్పాదులఁ గైకొని వచ్చుచున్నట్టుదే? నే నే మేమో తలపోయుచుఁ గాలము పుచ్చుచుంటినిగదా!

శార—[ప్రవేశించి] సఖా! ఏమి నీ చాకచక్యము! ముందుగనే పత్రపుష్పాదులఁ గోసి నాకై నిరీక్షించుచుంటివా? ఏవి నీవు కోసిన పత్రపుష్పాదులు? [అని మూటఁ జూచును.]

సత్య—చెలికాడా! నేఁ డింక నేమియుఁ గోయలేను.

శార—ఇంతవఱ కేమి చేయుచుంటివి?

సత్య—అనుభూతవిషయ మొుడు స్మరించుచుంటిని.

శార—వయస్యా! కొలఁదిదినములనుండి వెనుకటి సత్యవంతునివలెఁ గన్పడుటలేదు. ఇట్లుండుటకుఁ గారణము నీవే చెప్పవలయును.

సత్య—మిత్రమా! ఏమి యిట్లు పలుకుచుంటివి! మునుపటివాఁడను గాకుండు టెట్లు? కారణ మేమి?

శార—కారణమా? నిద్రలేనట్లు కన్ను లెఱ్ఱవాఱుటయు, ఎండతాకినట్లు మోము వాడుటయు, మేను తూలుటయుఁ, జిత్త మెక్కడనో యున్నట్లు లడిగినమాట కెప్పుడో సమాధానము చెప్పుటయు నీక్రొత్తదనమును జెప్పక చెప్పుచున్నవి.

సత్య—[తనలో] నిజముగ నే నల్లే యుంటినా? లేక యీతఁ డెగతాళి
సేయుచుండెనా? ఆహా! అలభ్యవస్తువులఁ గోరుటవలనఁ గార్య
సిద్ధి గాకుండుటయే కాక, మనఃక్లేశమును, బరు లెఱిఁగిన నప
నిందయుఁ గూడ వాటిల్లును గదా!

వీర—[తెరలో] శారద్వతా! శారద్వతా! సత్యవంతా! సత్యవంతా!
రక్షింపుఁడు రక్షింపుఁడు. [అని వీరవ్రతుఁడు తొట్రుపాటుతోఁ
ప్రవేశించును. శారద్వతసత్యవంతులు ఆశ్చర్య మభినయింతురు]

సత్య—మిత్రమా! త్వరపడకుము. నీ భయకారణ మెఱింగింపుము.
ని న్నెవరైన బాధించిన ఆ దురాత్ముల పేరు చెప్పుము. ఆ
ద్రోహుల మన్నిశితపరశుధారాహతులఁ జించి చెండాడి నీకు
సంతోషము కలిగించెద.

శార—వీరవ్రతా! ఏమి యిట్లు వచ్చుచుంటివి? నీ కేమైన గ్రహావేశ
మయ్యెనా లేక పిచ్చియెత్తెనా?

వీర—నాకుఁగాదు పిచ్చి; యింకొక క్షణ మున్న నీ పిచ్చి గిచ్చి
యెగిరిపోఁగలదు. త్వరగ వెళ్ళి నీ కౌపీనమును దాటియాకు
పుస్తకమును జాగ్రత్త చేసికొనుము.

సత్య—మిత్రమా! పరిహాసమునకా యిట్లనుచుంటివి?

వీర—పరిహాస మేమి? కొంప మునిఁగిపోఁగలదు. అంధులఁ లతి
దండ్రుల నొద్దైనఁ గొనిపోయి ప్రాణములఁ దక్కించుకొనుము.

శార—నిజముగ నీకుఁ బిచ్చియెత్తినది.

వీర—నేనుగనుక యింత సాహసముగఁ బలుకుచుంటినిగాని, నీవై న
నీపాటి కేమగుదువో?

సత్య—వీరవ్రతా! శారద్వతునిమాటలు లెక్కసేయక వృత్తాం
మును జెప్పుము.

వీర—వయస్యా! ఏ మని చెప్పుదును? వివిధతూర్యారావంబుల
భోరుగొల్ప సుభటకరోచ్చలితనిశితశరకాండంబులు మెఱయ
జతురంగబలసమేతుండై యెవఁడో యొక రాజీదెసకే వచ్చు
చున్నాఁడు. అదియే నా యాగమనకారణము.

సత్య—[ఆలోచన మభినయించును.]

శార—దీనికే యింత ప్రియాస పడుచుంటివా? ఒకరాజు కాఁడు; వేయిమంది రాజులు వచ్చినను మనకీ సత్యవతుఁ డుండ భయ ముండనేరదు. ఈ రాజులు గాదు; సురరాజులు వచ్చినను మునిజనమునకు వినుతియొనర్తురు గాని దుఃసుమ నిచ్చగింపరు. కాన భయంబును విడనాడుము. నీ కౌపీనపాలాశ దండముల నెవ్వరు గ్రహింపరు. విచారింపకుము.

సత్య—మిత్రవరులారా! పరిహాసము కాదుసుమా!

[తెరలో కలకలము.]

సత్య—[వినుట నభినయించి] మిత్రమా! శారద్వతా! రథనేమి ధ్వానములు వినవచ్చుచున్నవి. గజబృంహితములు విస్తరిల్లుచున్నవి. హయహేష లతిశయించుచున్నవి. సేనాసమేతుండై యొక రాజపుంగవుండు నిజముగ నీ దెసకే వచ్చుచున్నవాఁడు. చూడుము.

శార—కొంచె ముపేక్షింపుము. క్షణములో సర్వము విశదము కాఁగలదు.

సత్య—శారద్వతా! ఉపేక్షించుట కాదు.

వీర—ఎంతమాత్రము ఉపేక్షించకూడదు.

సత్య—మిత్రులారా! ఆ వచ్చు దుష్టరాజన్యుఁడు మా రాజ్యసర్వస్వమును హరించి మ మ్మీ యడవుల కంపిన దురాత్ముఁ డుగ్రసేనహతకుఁడు కాని యన్యుండు కానేరఁడు. ఆ నీచుఁడు మా యునికి నిచ్చట విని మా కొఱకు వచ్చుచున్నాఁడు. ఇంక నే నూరకుండరాదు. ఓరీ, వినయవిహీనా! ఉగ్రసేనా! నీ కాయువు మూడినది సుమీ!

మ॥ అదయుం వృద్ధుని నంధుమజ్జనకు రాజ్యభ్రష్టుఁ గావించి, దో
ర్మదవిస్ఫూర్తిని శత్రుశేషము నడంపం మాపయిం వచ్చితే!
యదలింతుం నిను నీబలంబులను నా హస్తాగ్రపాశంబుచే;
మొదలంటం విదళింతు శాత్రవవనీభూజంబు లీ గొడ్డటన్.

వీర—అటులనే గావించెద. [అని నిష్క్రమించును.]

సత్య—శారద్వతా ! నే సిదే వార్నిధి మథించు మంథాచలంబుచందంబున శత్రుసేనాసముద్రింబు ఘూర్ణిల్లఁజేసి వైరిసాహసతూల వాతూలుండనై రిపుకులోన్మూలనం బొనర్చెద. ఇందుండి యవలోకింపుము. [నడుముకు బట్టఁగట్టి సమరోత్సాహి యగును.]

అశ్వ—[తెరలో] మంత్రిశేఖరులారా ! ద్యుమత్సేనుఁ డెం దుండెనో విచారింపుడు. సత్యవండుఁ డెక్క డుండునో కనుంగొనుఁడు.

సత్య—[రోషముతో] ఓరీ ! ఉగ్రసేనహతకా ! ద్యుమత్సేన సంరక్షణ నియుక్తాత్మీయదేహపాలకుండగు సత్యవంతుండు—మౌనివర్యానుగ్రహాసాదిత దివ్యశరకాండ మండిత దోర్దండుం డగు సత్యవంతుండు—వైరిగర్వ నిర్వాపణదీక్షా బద్ధకంకణుం డగు సత్యవంతుండు—ఇందే యున్నవాఁడు; సమర మపేక్షించుచున్నవాఁడు. రా ! రమ్ము. వీరవ్రతా ! ధనుస్సు, ధనుస్సు

వీర—క్షత్రియకులాలంకార ! ఇదిగో ధనుస్సు; ఇవిగో బాణములు; గ్రహింపుము. [అని చేతి కిచ్చును.]

సత్య—[ఉత్సాహముతో] నేఁడుగదా, మదీయాస్త్ర శస్త్ర సామర్థ్య ప్రకటన సమయము ! నేఁడుగదా, మద్భుజబలసర్వస్వ ప్రదర్శనానంద సమయము ! నేఁడుగదా, మన్మనోగతశాత్రవావమానాగ్నికణవిజృంభణోత్కృష్టసమయము ! నేఁడుగదా, చిరకాలకాంక్షిత విజయలక్ష్మీ కరగ్రహణ మహోత్సవసమయము ! ఆహా ! ఇదిగదా, సుదినము !

మ॥ తురగ స్యందన హేమభూషలను దోర్దండో మిద్ధిఁ గావించి, త
త్కరికుంభస్థల మౌక్తికంబులను వీరశ్రీ దోరణాల్ గట్టి, దు
ర్భరవీరారికిరీటమండితమహారత్నప్రకాశంబులన్
వరపీఠం బొనఁగూర్చి, రాజ్యరమ స్వాంతం బొప్ప సేవించెదన్

[అని విల్లుఁబూని నారిని సవరించుచుండును.]

పురోహితుడు—[తెరలో] మహారాజా ! ఇదియే యాశ్రమ ప్రాంతము. [అని పురోహితుఁడు మార్గమును జూప అశ్వపతి మహారాజు ప్రవేశించును.]

అశ్వ—[స్వ] వీరిలో నా ధనుష్పాణియైయున్నవాఁడే యాకార చేష్టల సత్యవంతుఁడని దోఁచెడిని. ఏమి యీ మనోహరాకారము! శృంగారవీరంబుల కునికిపట్టువలె నీమూర్తి యెంత యానంద మొదవించుచున్నది.

పురో—[భయము నభినయించుచు] మహారాజా! ఈతఁ డెవ్వఁడు? ధనుర్బాణంబులు గ్రహించి యుద్ధసన్నద్ధునివలెఁ గానంబడుచున్నవాఁడు. మన కపాయ మాచరింపఁడు గదా!

అశ్వ—ఆర్యా! పరివార సహితుండనై వచ్చు నన్ను శత్రువునిఁగాఁ దలంచి కాఁబోలు, శరచాపంబులు సవరించుచు సమరోత్సాహియై యున్నవాఁడు.

పురో—దేవా! త్వరపడి శరము సంధించు నేమో! మన వృత్తాంత మెఱింగించెద? [అని సత్యవంతుని దిక్కు] ద్యుమత్సేనపుత్రా! సత్యవంతా! మేము కార్యార్థులము. నీ కహిత మాచరించువారము కాము. మ మ్మన్యథా తలంపకుము.

సత్య—[సవిమర్శకముగఁ జూచి] అపకార మొనర్చిన శత్రువులే వచ్చిరని యెంతయో యుత్సాహమున నుండ నా యుత్సాహభంగము గావించి కార్యార్థుల మనుచున్నవారే. నిరాయుధుండై పురోహిత పురస్సరంబుగ వచ్చు నీ రాజన్యుఁ డుగ్రసేనుండు కా కుండ నోపు.

అశ్వ—మునిబాలకులారా! నమస్కారము.

మునిపుత్రులు—అభీష్టావాప్తి రస్తు.

అశ్వ—సత్యవంతా! జననీజనకులతో ననామయంబుగ నుంటివా?

సత్య—చిత్తము.

అన—మాన్యులగు శైబీ ద్యుమత్సేను లెక్కడ?

వీర—వా రిందే యున్నవారు.

శార—మహారాజా! అవ్యాజకరుణాయత్తచిత్తంబున మ మ్మాఁదఱి నాదరించెడు మీ సత్ప్రగిపాలనంబునఁ బావనతఁ గాంచిన దేశంబును, భవన్నామధేయంబును విన వేడుక పొడమ్చుచున్నది.

పురో—ఈ యనఘుఁడు మద్రేశ్వరుఁడు.

వీర—ఆర్యా! ఈ సుచరితుఁ డశ్వపతిమహారాజా యేమి?

పురో—ఔను.

శార—ఉత్తమరాజసందర్శనమున బహూకృతుల మైతిమి.

సత్య—[సంతోషము నభినయించి] నేఁడు కడుంగడు సుదినము. దేవర యాజ్ఞ విన నర్థించుచున్నవాఁడ.

పురో—మా మహారాజాశయము నివేదించెద.

సత్య—సావధానుఁడనై వినుచున్నాఁడ.

పురో—

గీ॥ విశ్వనిర్మాత్రియైన సావిత్రికృపను
గాంచె సావిత్రి యను నొకకన్నె మిన్న
నన్నిట న్నీకుఁ దులదూఁగు నంచు నామెఁ
బత్నిగా నీయఁదలఁచె మా ప్రభువరుండు.

శారద్వత— } ఈ యనఘుని యభీష్టము నెఱవేఱుఁగాక; నెఱ
వీరవ్రతులు— } వేఱుఁగాక!

సత్య—ఆర్యా! మా జననీజనకు లిందే యున్నవారు.

అశ్వ—పూజ్యుల దర్శింప వేడుకపడుచున్నవాఁడ.

శార—అయ్యా! ఇటు దయచేయుఁడు. [అని తోవఁజూపును. అశ్వపతి, పురోహితుఁడు నిష్క్రమించుచుందురు]

సత్య—ఏ సుందరి మందస్మితవదనారవిందసందర్శనంబైన నీజన్మమున కగునో కాదో యని సంశయించితినో, ఆ సుందరి నా కర్ధాంగలక్ష్మి యగుటకంటె వేఱు భాగ్య మున్నదా?

[అని నిష్క్రమించును.]

ఇది తృతీయాంకము.

---



# సావిత్రీ నాటకము.

## చతుర్థాంకము.

[బ్రాహ్మణగృహము, విష్ణుశర్మ యను బ్రాహ్మణుఁడు ప్రవేశించును.]

విష్ణు—ఒసే! మల్లికా! [ఇటు నటుఁ జూచి] ఎక్కడకుఁ బోయినదో? వచ్చినది వార్ధకము. చేయునది భిక్షాటనము. చేసికొన్నది మూఁడవ పెండ్లి. అందును ముక్కోపి. మంచమునుండి లేచినది మొదలు గడప లెక్కటం, దిగటం. చెంబు నిండదు. నిండినఁ గాని కడుపునిండదు. రొండి నిఁడినగాని కండ్లు నిండవు. తప్పిన వీవు, చెంపలు. బైటి కేగిన పైవారికి దణ్ణాలు; ఇంటికివచ్చిన యిల్లాలికి దణ్ణాలు. వ్యాధులు వచ్చిన కళ్ళు కాళ్ళు నోరు చేతు లే కట్టివేస్తవి. అంతకు మించిన నన్నివిధముల ముక్తి. ఈ ముఁడలు సర్వాంగములు బంధింతురు. నేఁ డనుగ్రహమో, యాగ్రహమో? [అని నుదురు కొట్టుకొనుచు లోనికిఁ బోవును.] ఓసీ! ఓసీ! మల్లికా! ఏక్కడ కేగెనో? [అని వెదకుచుఁ గాలికిఁ గొట్టుకొని క్రిందఁ బడును.]

మల్లి—[పెద్దకేక వేసి] నీ కేమి? మాయరోగమా? పెఘనువాతమా? కళ్ళుపోయెనా? తలనొప్పిచే నొడలు తెలియకుండఁ బడియుంటినే, నీ కేమి బుద్ధిలేదు? ఇఁట్లో జబ్బువచ్చెఁగదా యెట్లు నిమ్మళించునా యన్నమాటమైన లేక దయ్యమువలె మీఁదఁ బడెదవా! ఇప్పుడు మాట్లాడవలదు. పొమ్మావలకుఁ; బొమ్ము. మహామహాసంపాదించేవానికైనా చెల్లదు. పొద్దున పోయి నాఁడు, ఇప్పుడు వచ్చినాఁడు. మల్లికా యట. అష్టదరిద్రుఁడా!

కఱ్ఱయొకటి పొడుచుకుంటూ వచ్చావు. నీకఱ్ఱ, నీవు విఱిగడై పోను. [అని కఱ్ఱనుదీసి యావల పాఱవేయును]

విష్ణు—[భయముతో చేతులుజోడించి] కఱ్ఱ బయట వేయుదువుగాని, నన్ను బయటవేయకే. నన్ను బయటవేయకు. నీకొఱకుగాదే యిన్ని కష్టాలు? [అనిబ్రతిమాలును.]

మల్లి—ఏమి కొఱకు! ఎముకలకొఱకు, ప్రాణాలుకొఱకు. కష్టాలట! కష్టాలు! ఏమి నీవుపడిన కష్టము! ఏదీ, నీ కష్టమునకు ప్రతిఫలము? [అని రొండి చూచును.]

విష్ణు—[చేతులు జోడించి భయముతో వడఁకుచు] నేఁ డేమియు దొరకలేదే

మల్లి—ఒట్టిచేతులతో నే మని వచ్చావు? ఇంటికి వచ్చేటప్పటికి నీ మొగానికి వండి కుమ్మరించితి ననుకొంటివా? సిగ్గులేదూ? [అని బుగ్గలు పొడుచును.]

విష్ణు—నీ దాసుఁడను, కొట్టబోకు. నాతప్పు మన్నింపుము. నీకోరికలు దీర్చెద.

మల్లి—ఇదివర కేమి తీర్చితివి? ఇం కేమి తీర్చెదవు? పెండ్లినాడుగట్టిన పుస్తెగా. ఇం కేమయినా నగలా? నాణెములా? ఎందుకు పాడు బ్రతుకు? చూడు. మన పొరుగింటిమహాలక్ష్మి మహాలక్ష్మివలె ఎన్నినగలో! ఇప్పుడు పెట్టిన నగ యింకాసేపటికి పెట్టుతుందా? ఇప్పుడు కట్టిన చీరె యింకాసేపటికి కట్టుతుందా? ఇప్పుడు తొడిగిన రవిక యింకాసేపటికి తొడుగుతుందా! మంచి మేడ, పట్టెమంచము. కాలు కిందపెట్టదు ఎండ కన్నెఱుఁగదు.

విష్ణు—ఔను, నిజమే. దాని యదృష్టము. దానిమగఁడు గోదావరిలో కొట్టుకొని వచ్చేటప్పుడు ఒకపెట్టె దొరికినది. దానితో కుబేరుఁడై నాఁడు.

మల్లి—వాఁడిమాత్రం తెలివి నీ కేల లేదు? వాఁడు గోదావరిలో పడితే, నీవు కృష్ణలో పడు.

విష్ణు—[దైన్యముతో] అయితే కృష్ణలోఁ బడ మంటావే?

మల్లి—కృష్ణలోపడ్డా నరే, చచ్చినానరే!

విష్ణు—ఇది వైశాఖమాసం వసంతఋతువు. కృష్ణలో నీళ్ళుండవు. వర్షాకాలము రానీ.

మల్లి—ఏట్లో నీళ్ళులేకపోతే ఉడుకుదుమ్ములో పడి చావు. డబ్బులు లేకుండా గడపెక్కితే కాళ్ళు విరుగుతయి; జాగ్రత! [అని మల్లిక నిష్క్రమించును.]

విష్ణు—ఈశ్వరా! జగద్బంధూ! నా కెన్ని కష్టములు నమకూర్చితివి!

సీ॥ వార్థకంబున నైనఁ • బలువుర వేఁడుచు
గడప లెక్కుచు బాధ•పడుటకంటె
ఎంతయార్జించిన • నెన్నియో లోపముల్
గలుగు సంసారంబు • గడవుకంటె
ముసలితనంబున • ముగుదను బెండ్లాడి
పడరాని బాములు • పడుటకంటె
దయయు దాక్షిణ్యంబు • తన ధర్మ మెఱుఁగని
యిట్టి యిల్లాలిని • నేలుకంటె
భార్యయం చని ప్రేమంబుఁ • బఱపఁబోయి
నెఱి తిరస్కృతిఁ దలమెత్తి • తిరుగుకంటె
శ్రమ యటం చెంచకయ కృష్ణ • దుమికి వేగ
మరణమందుట మేల్గాదె • మానవులకు.

[తెరలో] విష్ణుశర్మా! విష్ణుశర్మా!

విష్ణు—ఎవ రా పిలుచునది? రామదీక్షితులా యేమి? భార్యాపరాభవము బట్టలో తొడపాశమువంటిది. రానిమ్ము. గంభీరముగ నుండెద. [అని యుత్సాహ మభినయించుచుండును.]

రామదీక్షితులు—[ప్రవేశించును.]

విష్ణు—రామదీక్షితులూ! ఏమో పనిమీఁద వచ్చిన ట్లున్నదే?

రామ—అవును, కృష్ణాజిన మొకటి కావలయును.

విష్ణు—నీకుఁ గృష్ణాజినములకు తక్కువా? నిన్ననేగదా రెండు కొత్తవి వచ్చినవి.

రామ—అరణి, పాత్రిలు ఏమేమో అన్ని కట్టినాను.

విష్ణు—ఎక్కడికైనా సకుటుంబపరివారముగా యేమి?

రామ—ఔను ఎఱుగవా యేమి, రాజుగారింట పెండ్లిసంగతి?

విష్ణు—దీక్షితులూ! ఏ రాజుగారింట్లో?

రామ—మద్రదేశాధీశ్వరుఁడైన అశ్వపతి మహారాజు తన పుత్రిక యైన సావిత్రిని నదీప్రాంతమున మునిపల్లెలో నున్న సత్యవంతుఁడను సాళ్వరాజపుత్త్రున కిచ్చి వివాహము చేయుచున్నాఁడు.

విష్ణు—అయితే బాగుగా జరుగుచున్నదా?

రామ—బాగూ గీగూ నాకుఁ దెలియదు. ఆ వన మొక నందనవనముగా, ఆపల్లె యొక స్వర్గముగా నున్నది. ఆ వైభవములు ఆ వేడుకలు చెప్ప నలవిగాదు. లక్షలకొలఁది జనమున కన్నదానము; అందఱికిఁ గ్రొత్తవస్త్రములే; అందరికిఁ జందనచర్చలే; అందరికిఁ బూవుహారములే; అందరికి ఆనందమే.

విష్ణు—పండితసత్కారము మాటో?

రామ—వెఱ్ఱివాఁడా! అది వేరుగఁ జెప్పవలెనా? అడుగనివాఁడు పాపాత్ముఁడు. కనకవర్షము కురిపించుచున్నవాఁడు. ఎవ రేది కోరిన నది యిచ్చుచున్నాఁడు. అశ్వపతిమహారాజు అర్థిజన కల్పక మనుటకు సందియము లేదు. దేశదేశములనుండి వచ్చి యశేషజనంబు లక్కడనే యున్నారు ఇదివరకే మనవా రందరు వెళ్ళినారు. నేనును పోయివచ్చితిని. నేఁడు సకుటుంబముగ పోవుచున్నాఁడను. నీవుకూడ రా, ఏదో లభించఁగలదు.

విష్ణు—అయితే పెండ్లి అయిన దన్నమాటే. ఇంక మన కేమిలాభము?

రామ—కావడ మెక్కడ? మళ్ళుదోరణములేదా? విందు భోజనములు లేవా; రాజగృహములలో నెలలకొలఁది జరుగుచునే యుండును!

విష్ణు—నాకీ మధ్య జబ్బుచేయుటచే ఈ సంగతియే తెలియలేదు సుమా! అయితే నాలుగు మంచిమాటలుచెప్పి, యింటావిడను దీసుకొని వస్తా, కృష్ణాజిన మిచ్చెదను రా.

[అని యిర్వురు నిష్క్రమింతురు.]

[పర్ణశాల—సత్యవంతుఁడు ప్రవేశించును.]

సత్య—[స్వ] పాణిగ్రహణవిధి నిర్వర్తించినను అశ్వపతిమహారాజు సపరివారముగ నున్నవాఁడు. ప్రేమప్రవాహము నాపుట దుర్ఘటముగదా! కానిమ్ము. ప్రియురాలిని సమీపించెద. ఆహా! నా మనోహారిణిప్రకృతస్థితి యెంత యామోదపాత్ర మగుచున్నది.

ఉ॥ సుందరియంచుఁ బిల్వఁగొఁన • చూపడరించుచు మోమువాంచు; రా కేందునిభాస్య! సిగ్గిలెద • వే లన బిత్తరిచూపుఁ జూచు; నో చందనగంధి! రమ్మన వెనం బులకాంకిత యాను, పాణి నే నందఁ జలించి స్విన్నయయి • యల్లన నవ్వి కరంచుఁ జిత్తమున్.

అదిగో దేవి, అత్తమామల నర్చించి ఆశ్రమస్థితుల సలవ రించుకొనుచున్నది.

[చూచి సంతసముతో]

గీ॥ ప్రొద్దుటఁ బిచ్చు తామర • మొగ్గవోలె సలలితం బగు నిజపాణితలము వంచి హరిణపోతంబునకుఁ జామ • లందియిచ్చి దువ్వి ముద్దాడుచున్న దీ • పువ్వుఁబోఁడి.

అదిగో, యిటే వచ్చుచున్నది.

[సావిత్రి ప్రవేశము.]

సత్య—దేవీ! వల్కలధారిణివై యిట్లుంటి వేల?

సీ॥ కురులసౌభాగ్యంబు • మఱుఁగుఁజేయు నటంచు
దలమానికముఁ దీసి • దాఁచినావొ
గళవిలాసంబును • గన్పింపనీ వంచు
విమలముక్తాలతల్ • వీడినావొ
కటిసోయగంబును • గప్పివుచ్చునటంచు
స్వర్ణమేఖలఁ దాల్ప • వదలినావొ
పదపద్మసంపదఁ • గొదువసేయు నటంచు
మంజీరము లమర్ప • మానినావొ

రమణిరో! యిప్పు డీవు నిరస్తభూష
వయ్యు నేత్రసుధావర్తివైతి వరయ
సహజసుందరి కన్యభూషణము లేల?
మెఱుఁగుఁగోరెనె యొందేని మెఱుపుతీఁగ?

సావి—భర్త యెట్లుండునో అట్లుండుటయేగదా స్త్రీలకు ముఖ్య ధర్మము? తాము వల్కలధారులై యుండ నే నన్యవిధముగ నుండుట యుక్తమా?

సత్య—ప్రాణేశ్వరీ! మహారాజపుత్త్రికవై, నిరుపమాన సౌందర్య రాశివై, వేనవేలు దాసీజనంబు లూడిగఁబులు సేయుచుండ, మహానైభవోపేతుఁడైన యొక రాకొమరుని వరించి సౌఖ్యము లనుభవింపక, యంధులగు నత్తమామల సేవించుచుఁ గంద మూలాదుల భుజించుచుఁ గాననవాసియైన నన్నుఁగోరుకొనుట, రాయంచ లవణసముద్రమ నపేక్షించు విధము కాకుండునా?

శా॥ కాంతా! ప్రాభవసంయుతుల్ నిరుపమాకారుల్ స్ఫురద్రత్నసం
క్రాంతానేకవిచిత్రనిర్మితమరుత్ప్రాసాదసౌభాగ్య శు
ద్ధాంతాంచన్మణిభర్మడోలికల నిన్నర్చింప నర్థింప, నీ
కాంతారాంతరమందుఁ గుందువడ నాకాంక్షింపఁగాఁ జెల్లునే!

సావి—ఆర్యపుత్త్రా! ఏల యిట్లు పలికెదరు? స్త్రీల కెన్ని జన్మముల పుణ్యవిశేషముననో గాని సౌందర్యఖనియై, విద్యావంతుఁడై, సత్ప్రవర్తనశీలుఁడై, యనురాగవంతుఁడై యున్న ప్రియభర్త లభింపనేరఁడు. మానవతికి భర్తతోఁ గష్టమని యొం డుండునా?

మ॥ నవరత్నాంచిత సౌధరాజములు, నానాదివ్యభూషావళుల్,
స్తవనీయాఖిల భోగముల్, సతికి విద్వన్నుత్యుఁడై యోగ్యుఁడౌ
ధవుఁడేకాదె! తలంప; నట్టి ప్రియుతో దారిద్ర్యమేకాని యు
గ్రవనావాసమెకాని మోదమగు; స్వర్గం బేల కాంతాళికిన్?

ఓ దేవా! నేను రాజపుత్త్రిక నయ్యుఁ గష్ట మందుచుంటినని తలఁపకుఁడు. చంద్రకాంతమణి సౌధముల వసించుచు సేవకులచే నిఖిలోపచారములు గైకొనుచు సకలసౌభాగ్యంబులు ననుభవిం

చుచుఁ జక్కఁగ రాజ్యపాలన మొనర్పఁదగిన మీకుమాత్రి మీయరణ్యవాస ముచితమైనదా? భోగభాగ్యము లెవ్వరికి స్థిరములు కానేరవు. కాలమే యాదఱ మార్చుచుండును. కష్టమను శబ్దమునుగూడ మఱచి మహానంద మనుభవించెడి నాకై చింతింపకుఁడు. ఈ యరణ్యవానము నాకుఁ బ్రియానకర మని తలంపకుఁడు. ఆర్యపుత్రా! నగర నివానమునకన్న నీ ప్రదేశము లెంత సంతస మొదవించుచున్నవో చూడుఁడు!

సీ॥ విలిచి తేఁ బనిలేక • మలయానిలము వీఁచు
వికచకైరవవనీ•వీథినుండి
శ్రమ మందఁ బనిలేక • స్వచ్ఛజలం బబ్బు
విమలగంగాప్రవా•హములనుండి
యడియాస పడకుండ • నాహారము లభించు
నవనవోజ్జ్వలఫలా•టవులనుండి
ప్రార్థింపఁ బనిలేక • పరతత్త్వము లభించుఁ
బరమయోగీశ్వరే•శ్వరులనుండి
శిరముపైనున్న భారంబు • దొరలినట్లు
బంధములనుండి ముక్తినిఁ • బడసినట్లు
స్వాంతమున కెందులేని పి•శాంతి కలిగెఁ
దాపసాశ్రమమున కుద్ది • ధరణిఁ గలదె?

దేవా! నామనోనిశ్చయము చెప్పెద నాకర్ణింపుఁడు.

గీ॥ సురతరులనీడలందునఁ • దిరిగినట్టు
మేరుపర్వతతరులందు • మెలఁగినట్టు
లా జగన్నాథుసాన్నిధ్య • మమరినట్టు
నిజము గస్పట్టు నీదుస•న్నిధి హృదీశ!

సత్య—దేవీ! అట్టి మనశ్శుద్ధిగల నీయట్టి తరుణీమణి లభించుటకంటె ఈ జన్మమునకు వేఱు భాగ్య మున్నదా?

[తెరలో—అయ్యో! ఇటు, ఇటు.]

సావిత్రి సత్యవంతులు—[వినుట నభినయించి]

సావి—ఆర్యపుత్రా! మా తండ్రిగారి మాటవలె నున్నది. మనల వదలనేరక, వదలనేరక నేఁడు స్వపురమున కేఁగుద మని చెప్పిరి. ఇటు తోడితెచ్చెద.

[మాళవ్యశ్వపతులు శైబీద్యుమత్సేనులు మంత్రులు పురోహితులు చెలికత్తెలు ప్రవేశించుదురు.]

అశ్వ—[స్వ] ఇప్పుడుగదా, పితృపితామహాదులతోఁగూడ ధన్యుఁడనైతిని. [ప్ర] దేవా! ద్యుమత్సేనమహారాజా! నావిజ్ఞాపన మొండు కలదు. సావధానచిత్తులరయి యాలకింపఁ బ్రార్థించెదను. మీ రెల్లరు మా రాజ్యమునకు దయచేయవలయును. సత్యవంతుఁడే రాజ్యపాలనము సేయుచు మనకు సంతోషమును గలుఁగజేయఁగలఁడు.

ద్యుమ—మదేశ్వరా! మహోదారస్వభావులరగు మీ వాక్యములు మిగుల నమాదరణీయములు—కుమారా! మామగారిని సమాధాన పఱుపుము.

సత్య—జనకా! మీ రెఱుఁగని దేమున్నది? నామాట యటుండనిండు. పరాధీనుల రైన మీ రిప్పుడుగాదు, ఇంకెంతటి యాపదలు వాటిల్లినను బరగృహవాసమును, బరభాగ్యోపజీవనము నిచ్చగింతురా? కాలవశమునఁ గానవవాస మొదవిన నొదవుఁగాక! ప్రతాపాగ్నిచే వైరికాననము దహించి భుజబలంబు మెఱయ నిర్వక్రపరాక్రమంబున రాజ్య మార్జించి న్యాయపాలన మొనర్చుట రాజధర్మము. కావున నే నందుల కెంతమాత్ర మంగీకరింపను.—దేవా! అశ్వపతిమహారాజా! మీ యాజ్ఞోల్లంఘన మొనరించితి ననుకొనకుఁడు.

ఉ॥ విల్లును బూననేర్చి పృథివీపతికిన్ రిపురాజుగుండియల్
దల్లడిలంగఁ బేర్చి భుజదర్పమునం గొని రాజ్య మేలుటల్
చెల్లునుగాని, యెల్లరుకనిన్ సియున హీనత నీసడింపఁగా
నిల్లరికంబువోవు టది యెవ్వరికైనను జెల్లునే నృపా!

మీ యాజ్ఞ నిప్పట్ల సెఱవేర్చనందులకు మన్నింపుఁడు.

అశ్వ—[స్వ] రాచినకొలందిని వజ్రిమువలె ధీరచిత్తు లెంలెటి విప త్తును బొందినను నైజతేజమును విడువఁజాలరు. [ప్రకా] ద్యుమత్సేనమహారాజా! సత్యవంతా! మీా యిష్టానుసారమే కానిఁడు. అమ్మా! సావిత్రీ! నీ యభీష్టము నెఱవేఱినది గదా! తల్లీ! లేకలేక, చిరకాలమునకు నా సావిత్రికృపచే నిన్నుఁ గనినందులకు భర్తతోఁ గూడ నాయింటనే యుందు వని సంతసించితిని. అట్టి యదృష్టము కలుగదయ్యె. సర్వ సౌభాగ్యము లనుభవించెడి నీ వీ వనమునం దెట్లుభయయల గౌరవములు కాపాడెదవో? తల్లీ! సావిత్రీ!

మ॥ ఎటుసేవించెదొ! యత్తమామలు మహావృద్ధుల్ గదుంజీఁకు;లీ
వెటు లర్చించెదొ! నీదునాథుఁడు బుధుఃడింపొందఁగానేర్పమై;
యెటుపూజించెదొ! మానులఁ; జెలుల నేయేరీతి మన్నించియీా
యటవిఁ బేదుప్రతిష్ఠలం బడసి మమ్మానంద మొందించెదో?

మాళవి—కుమారీ! ప్రాణాధికవైన నిన్ను విడిచి యెట్లుండఃగలము? నీ పఠనమందిరము, నీ క్రీడాభవనము, నీ గానకళాసాధనములు చూచి యెట్లోర్వఁగలము? సుధారసం బొలుకు నీ వలుకు లాలింపక, నిరతరానందసంధాయకంబులగు నీ యాటపాటల కానందింపక, నిరతిశయసుఖాస్పదం బగు నీముఖారవిందం బవలోకింపక యమృతరసావగాహనమును మఱపించు నీసా న్నిధ్య మనుభవింపక యెట్లుండఁగలము?

మ॥ కొడుకుంగూఁతువునై ననీవకద! మాకుఁ; నిన్నువీక్షింపమిఁ
గడెనే పొక్కుయుగంబుభంగి మదికిఁగన్పట్టు; నుగాత్రిటవిఁ
విడి పోవంగను బాదముల్ తడఁబడుఁ, విశ్వంబు పెన్జీకటిం
బడినట్లుగడును; మేఁవ్వడంకు; నీఁక నిల్పఁ శక్యమే ప్రాణముల్?

అశ్వ—దేవీ! బిడ్డకు ధైర్యముచెప్పుము; మనముఁ గలఁపకుము.

సావి—సఖులారా! న న్నొకమాఱు కౌఁగిలించు కొననిండు. [అని కౌఁగిలించుకొనును.]

శ్యామ, వానం—చెలీ! ని న్నెట్లు విడువఁగలము? ఇంక మాకు విద్యాబుద్ధులఁ గఱపి మ మ్ముద్ధరించువా రెవ్వరు? [అని విచారపడుదురు.]

సావి— సఖులారా! దుఃఖపడకుఁడు. జనకా! జననికి ధైర్యము చెప్పుము. అమ్మా! శ్యామలావాసంతికల నాకుమాఱుగఁ జూచుకొనుము.

అశ్వ—తల్లీ! నా కెవ్వరుధ్ధైర్యము చెప్పుదురు? కుమారీ! నెమలి నృత్యము లెవరు చూపింతురు? క్రీడాశుకముల నెవరు పలికింతురు? కావ్యవిశేషముల నెవరు ప్రశ్నింతురు? అమృతపుకళికవలె నన్నెవ రలరింతురు? నీగుణము లెన్నియని మఱువఁగలము? నావలేని సముద్రము నెట్లు దాటఁగలము?

చ॥ దినదినముం బ్రదోషమునఁ • దెల్లని చీర ధరించి, మోమునందున నవకుంకుమంబు నిడి, • తోయజపత్రము వెట్టి వేసలిం, దన చెలులెల్లఁ గొల్వఁగ యథావిధి దేవి భజించి, వీణియన్ గొని లలిఁబాడి, నందనువుకూఁతువినామెటులుందునింటిలోన్?

మాళవి—కుమారీ!

గీ॥ పసిడిమేడల నుయ్యేలఁ • బవ్వళించి
చెలులు సత్కావ్యచర్చలు•సేయ వినుచు
గెలువుఁగనువారిఁ గానుకల • నలరఁజేయు,
తల్లి! నిన్వీడ హృదయంబు • తల్లడిల్లు.

[సావిత్రిని దగ్గరకుఁదీసి] అమ్మా! శైబీ! నా ప్రార్థన మాలకింపుము.

చ॥ అడిగియొసంగ కున్నఁ దన•యాఁకలిఁ దాఁ దెలియంగలేదు; వెంబడి చెయివట్టినన్ జెలులు•పాదము తొట్రిలు తోఁటకేఁగఁగా; నడలు శుకంబు తీవ్రముగ•నార్చినఁ; బువ్వులదండఁగూర్చినన్ బడలికఁ గాంచు; నిట్టి సుత•భారము సర్వము నీదె శైబిరో!

[సావిత్రీహస్తమును శైబీహస్తమున నుంచును.]

కుమారీ! నా యీ పలుకులు శ్రద్ధతో నాలకింపుము.

చ॥ అలిగినవేళ భర్త కెదు•రాడకు మెప్పుడు; నత్తమామలన్ బలికినఁ గోపమూని ప్రతి•భాషణముల్ వచియింపఁబోకుఁ; నెచ్చెలుల మనంబు నొచ్చఁదగు•సేఁతలు సేయకుఁ దాపసీజనంబుల మదిలో మెలంగి ముని•ముఖ్యులు మెచ్చఁ జరింపుపుత్త్రికా!

శైబి—[సవ్వ] పుత్త్రికాప్రీతి యనిర్వాచ్యముకదా! తనయల వీడ నేరక అత్తవారిల్లన నెన్నిఁటినో శంకించుచుందురు.

అశ్వ—కుమారీ!

గీ॥ కలిమియును లేమియును భర్త • యెఱిమి నెఱిఁగి
వచ్చుఁ దమ బంధు మిత్త్రుల • వాసి నరసి
సమయ మెఱిఁగి ప్రవర్తించి • సర్వజనులు
పొగడఁ దగునట్టి కీర్తిఁ • బొందు పుత్త్రి!

తల్లీ! ఉభయకుల గౌరవంబులఁ గాపాడుచు సాధ్వీమ తల్లివై ప్రవర్తింపుము.

సావి—జననీజనకులారా! మీ యాజ్ఞను శిరసా వహించెద. అమ్మా! నాకై విచారింపకుము. ధైర్య మవలంబింపుము. సఖులారా! మద్వియోగఖిన్నయగు మాయంబ నానందింపఁజేయుఁడు.

శ్యామ— } సఖీ! నీ యాజ్ఞానుసారమే ప్రవర్తించెదము. మమ్మ
వాసం— } మఱవకుము.

సావి—జననీజనకులారా! మఱల మి మ్మెన్నఁడు చూతునోగదా!

[అని కౌఁగిలించుకొని దుఃఖించును.]

అశ్వ—కుమారీ! దుఃఖింపకుము. [అని బుజ్జగించును.]

[తెరలో] ఓహో! బ్రాహ్మణవర్యులారా! మంత్రి సామంత శేఖరులారా! నిఖిలపౌరజానపదులారా! మహారాజు స్వపురమున కేగుచున్నవాఁడు ఎల్లరు దయచేయుఁడు.

అశ్వ—శైబీ ద్యుమత్సేనులారా! నాకు సెలవొసంగుడు. సత్యవంతా! నేను పోయివచ్చెద. తపోధనులారా! నా కాజ్ఞ యిండు. కుమారీ! భర్తృసేవాపరతంత్రివై మెలంగుము. మాకై విచారింపకుము. దేవీ! మనము పోదము రమ్మ.

[అందఱు నిష్క్రమింతురు.]

మల్లిక—[ప్రవేశించును.] అందఱు పోతున్నారు. ఇక వస్తాడులే. రానీ, వచ్చేటప్పుడు చిలక్కచెప్పినట్లు చెప్పా. వింటేగా? సొమ్ములేవు, చీరలేదు, మర్యాదజరుగదుఅన్నా, విన్నాడా? నువు రా! నువు రా! దంపతిపూజ; వాడిమొఖం పూజ,

ఏం వచ్చింది ? ఏ మిచ్చారు ? చూచేవాళ్ళంతా నవ్వడమే కదా! పూసలేన్దానవు పెండ్లి కేం వచ్చా వన్నారుకదా! ఆదీపాల ముందర దివిటీవలె వెలగాలిసినదాన్ని. పోనీ అరువు సొమ్మై నా తేసిచ్చాడా ? వీడితొాందరగాల; వీడి నోరు పడిపోను; వీడిచేతులు విరగడై పోను. వస్తున్నాడులే; రానీ. [ముందు జూచి] వీడి హతమారుస్తా. [అని చెట్టుకొమ్మఁదీసి చేతఁ బట్టుకొనును.]

విష్ణుశర్మ—[తెరలో] ఒసేవ్! మల్లికాంబా! మల్లికాంబా! మల్లికా! మల్లీ! మల్లాం! [అనుచుఁ బ్రవేశించి] ఈ ముండ మాట్లాడుతుందా? ఎక్కడికో పోయింది. ఏదో తెస్తుంది. డొక్క చీలుస్తాను; డోలు కడుతాను. ఎందుకు పలుకదో చూస్తాను. నాదుంప తెంపుతున్నది. ఇవ్వాళతో చెల్లు. ఇదైనా చావాలి, నేనైనా చావాలి

మల్లి—ఎవరిని చంపుతావు, నీవు? నీచేత చచ్చే దెవరు? చేసికొన్న పెండ్లానికి కూడుపెట్టలేని శూరుఁడవు—ముష్టి యెత్తుకుంటేనేగాని గడవని వీరుఁడవు— నల్లపూసలోనికి తెల్లపూస చేయించలేని ధనికుఁడవు— నీవు నా కాజ్ఞ పెడతావు ? నాకు నీ యదుపా ? నీమాట నేను వినాలీ ? వినిపిస్తా, వినిపిస్తా, [అని బెత్తములో నొకటివేసి] కూర్చో? కూర్చోవేం.—[అని బెదరించును.]

విష్ణు—[భయము నటించుచు కూర్చుండును.]

మల్లి—[మఱియొక దెబ్బవేసి] లే, లే! [ఇంకొక దెబ్బవేసి] లే, లే వేం ? [అని బెదరించును.]

విష్ణు—[లేచును.]

మల్లి—[బెత్తమెత్తి] కూర్చో.

విష్ణు—నీయమ్మకడుపుకాల! గుంజిళ్ళు తీయలేనే, పెద్దముండకొడుకునే. నీ మొగుణ్ణే.

మల్లి—మొగుడువా ? మొద్దులవా ? గుంజిళ్ళు తీయలేవూ? మాయ రోగమా? పెళ్ళి పెళ్ళి యని లాక్కొస్తావూ ? ఇంతదూరం నని

పిస్తావు ? గుంజిళ్ళుతీయడాని కెంతకష్టమో, నడవడాని కంత కష మని నీకు తెలియదూ ?

విష్ణు—వచ్చినందుకు ఫలము వచ్చింది కాదే ?

మల్లి—ఈగుడ్డేనా ? ఈగుడ్డేనా ?

విష్ణు—ఇం కేంకావాలే ? నాకు ధోవతులచావు, నీకు చీరె, వెండిపీట, వెండిచెంబు ఇంక న న్నేడిపించకే ?

మల్లి—ఏడిపిస్తానా, చంపుతానా. వెండిచెంబట, వెండిపీటట. ఎందుకు తలబద్దలుకొట్టుకోనా !

విష్ణు—చంపు, ఎట్లా చంపుతావో. నీతలకాయ పగలకొడతా చూడు. [అని కఱ్ఱయెత్తును.]

మల్లి—[కఱ్ఱలాగి] కొడతావుగా ? కొడతావా! నీతలపండు పగల. [అని రెండు గుద్ది కొట్టును.]

రామ—[తెరలో] విష్ణుశర్మా! విష్ణుశర్మా!

విష్ణు—[క్రిందబడి దెబ్బలుతింటూ] చావు ముండా, చావు. అంతే కావాలె నీమదమణగాలె. ఇవ్వాళతో చచ్చావులే. [అని తాను భార్యను గొట్టుచున్నట్లు కేకలువేయును.]

రామ—[ఆతురతతో వచ్చి] విష్ణుశర్మా ! విష్ణుశర్మా ! ఇదేమిటోయి?

విష్ణు—అశ్వపతి మహారాజుగా రిచ్చిన దంపతికట్నం మూటకట్టవే, వెళ్ళుదామే అంటే, ఈభడవముండ మూటకట్టదు; బయలు దేరదు. అప్పుడు నాకు విసుకువచ్చి కఱ్ఱతో నాలుగు దెబ్బలు వేసేటప్పటికి, ఇప్పుడిప్పుడు తిరిగి దోవకు వస్తున్నది.

రామ—అది దోవకు వస్తున్నదా ? నీవు దోవకు వస్తున్నావా?

మల్లి—అ దంటావూ ! ఎవ రనుకొన్నావు ? ఎరిక ల్దనుకున్నావా ? యానా ద్దనుకొన్నావా? ఏమనుకున్నావు? బుద్ధితక్కువమాటలు మాట్లాడుతావ్! ఒళ్ళు దగ్గరపెట్టుకొని మాట్లాడు.

రామ—'అమ్మా ! తల్లీ !' అని పూజించడానికి, పెళ్ళా న్నణచుకోలేని విష్ణుశర్మ ననుకున్నావా? నోరు కాపాడుకో. నాజోలికి వచ్చా వంటే యేంజేస్తానో చూడు. ఎవ రనుకున్నావు?

మల్లి—ఏదీ? ఏంచేస్తావో చెయ్యి. [అని మగనినయిపు తిరిగి] ఒరే! వరాయివా డొచ్చి నన్ను తిడుతుంటే కళ్ళు మిటకరించుకొని చూస్తూన్నావుగా?

విష్ణు—నిన్ను మెడగట్టుకొన్న పాపాన నేను తిట్లు మొట్లు తిన్నానని ఊళ్ళోవాళ్లు తింటారా? వూరుకుంటారా?—నారయనా! ఈ గయ్యాళిముండ గొంతుకొయ్యి; నన్ను రక్షించు.

రామ—ఇటువంటిదానిని గొంతు కొయ్యవలెనా? ఉప్పుపాతరలో వెయ్యవలెనా?

మల్లి—ఏమిటాని? ఉప్పుపాతట్లో వేస్తావటరా! ఏది వెయ్యి. ఎట్లా వేస్తావో చూస్తాను? [అని క్రింద వేసిన బెత్తమును గ్రహించును.]

రామ—ఉండు. నీపని చెపుతా [అని కఱ్ఱకై పోవును.]

విష్ణు—నీ కేమి రోగమే, అతన్ని కొట్టబోతావు? [అని కఱ్ఱను గ్రహించం బోవును.]

మల్లి—[ఒంగిన విష్ణుశర్మను రెండు కొట్టి] చస్తున్నాను, చస్తున్నాను. వీళ్ళు నన్ను చంపుతున్నారు. నిండు ప్రాణం తీస్తున్నారు. స్త్రీ హత్య చేస్తున్నారు. అయ్యో! రండరాణి! రండరాణి! వెంకట లక్ష్మీ! శేషమ్మా! కోటమ్మా! వెంకటదీక్షితులూ! [అని కేకలు వేయును.]

వీరవ్రతుండు } శారద్వతుండు } [తెరలో] వచ్చుచున్నాము, వచ్చుచున్నాము. [అని ఇర్వురు ప్రవేశింతురు]

విష్ణు } రామ } [మునిపుత్రులకు నమస్కరించి] అయ్యా! మమ్మ రక్షించండి. మా ప్రాణాలు దక్కించండి. మాఆపద తొలగించుండి. ఈ గయ్యాళికి బుద్ధిచెప్పండి. [అని బ్రతిమాలుదురు]

మల్లి—చెప్పండి. ఇంకా చెప్పండి. ఎవరితో చెప్పి యేంచేస్తారో చూస్తా.

మునిబాలకులు—ఎందుకమ్మా యీయల్లరి? ఏల యిట్లు కేకలువై చితివి

మల్లి—వీడు నామొగుడు. ఈయన మాపొరిగింటాయన. వీళ్ళిద్దరేకమై నన్ను చంపటానికి ఐచ్చారు. నేను కేకలు వేశాను.

శార—ఇది యే మమ్మా? భర్తను 'వీఁడు, వాఁ' డనవచ్చునా?

మల్లి—బలే! నీ వే మేమో దిద్దుతా వనుకుంటే, నాకు బుద్ధిచెప్పు తున్నావు?

శార—వీరవ్రితా! ఇది నిశ్చయముగా కొంపలుకాల్చే కొఱవివలె నున్నదే!

విష్ణు—ఇది నా కొంపతీసి, నా దుంప మొదలంట తెంపుచున్నది.

రామ—దీనినోటికి అదుపూ అజ్ఞ లేదు. మీరయినా బుద్ధిచెప్పండి. పెనిమిటిని చావఁగొట్టి, నన్ను కొట్టడానికి కఱ్ఱయెత్తింది.

మల్లి—నా తెరువువస్తేనా! కొడతానా ముక్కలు ముక్కలు చేస్తానా?

శార—అమ్మా! స్త్రీల కింత పారుష్యము తగునా? నిన్న మొన్న వివాహమైనదో లేదో, మహారాజపుత్రియయ్యును సావిత్రి యెట్లున్నదో చూడుము. ఆమెను జూచి పాతివ్రిత్య ధర్మ మును నేర్చుకొనుము.

మల్లి—ఎట్లున్న దేం?

విష్ణు—అట్లా బుద్ధి చెప్పు, నాయనా!

రామ—ఆ సాధ్వీమణిగుణములు చెప్పుము.

శార—చెప్పెద నాకర్ణింపుఁడు!

సీ॥ రమణీయమణిభూష•ణముల నన్నిఁటిఁ దీసి
యడవిపూదండల • మెడ ధరించు
చీనిచీనాంబర•శ్రేణిని విడనాడి
నారచీరను బ్రియ•మారఁ దాల్చు
దాసీజనంబును • దనవారికడ కంపి
స్వయముగఁ దనయింటి•పనులఁ దీర్చుఁ
గుసుమకోమలి యయ్యు • విసువుఁజెంద కొకింత
విభు నత్తమామల • వేడ్కఁ గొలుచు
అగపడదు రాజసము, దుంప•లైన మెసవు,
నడవి కాపుర మన, దెందు • నెడల దబల!
యెప్పు డేరీతి నుండునో • యప్పు డట్లు
బతి ననుసరించు టే కద, • నతికి హితవు!

స్త్రీలకు భర్తకంటె వేఱుదైవములేదు గావున శాంతి వహించి నీ పతియిష్టానుసారము ప్రవర్తించి యిహపరంబు లనుభవింపుము.

విష్ణు—తండ్రీ! మంచిగా నుపదేశించినావు. నీ నోటికి మ్రొక్కుచున్నా ను నీకాళ్ళకు మ్రొక్కుచున్నాను. [అని నమస్కరించును.]

మల్లి—వాడి నోటి కేమని మొక్కటం? కూడు పెడతాడా? గుడ్డ పెడతాడా? మొక్కు; నానోటికి మొక్కు. నాకాళ్ళకు మొక్కు. [అని రెండు దెబ్బలు వేయును.]

రామ—అయ్యలారా! దుర్మార్గులకు నీతిచెప్పిన నేమగునో చూచి తిరికదా!

విష్ణు—దైవమా! ఈ భార్యామూలమున నే నెన్ని యిక్కట్టులకుఁ బాలైతిని? తలిదండ్రుల విడనాడితిని. సోదరులఁ ద్యజించితిని. బంధువుల దూషించితిని. స్వదేశమును బాసితిని. ఉచ్చనీచ ముల నెంచక దీనియాజ్ఞ నాదల ధరించితిని. అనవరతము దీని కనుసన్నల మెలంగితిని. ఇంక నే నీ బాధ భరింపనేరను. నేఁటితో నీ సంబంధం తెంచుకుంటున్నా. నీ చేతిలో దెబ్బలు తినటానికిఁ దెచ్చుకొన్న యోర్పులో వెయ్యోవంతు ఈశ్వరా రాధనకిరింద వుపయోగిస్తే యీ మునలితనములో నాకీ కష్టా లుండవు. ఈశ్వరా! జగద్బంధో! మాం పాహి, మాం పాహి; మాం రక్ష, మాం రక్ష. నన్ను కష్టంబులనుండి యుద్ధరింపుము. ఇప్పుడే సన్యాసమును గ్రహించి యిక్కడనే కాలము గడపెద. [అని జంధెమును ద్రెంపును.] నాయన లారా! నాకుఁ దారి ముపదేశింపుఁడు.

శార—మంచిది. పోదము రమ్ము. [అని రామదీక్షితులు, ముని పుత్త్రులు, విష్ణుశర్మ నిష్క్రమింతురు.]

మల్లి—నా పీడపోయినది. ఇట్టిసన్న్యాసులు నాకళ్ళముం దెందఱో అయినారు. [అని నిష్క్రమించును.]

ఇది చతుర్థాంకము.

---



# సావిత్రీ నాటకము

## పంచమాంకము.

[ఆశ్రమప్రాంతమున వీరవ్రతుఁడు ప్రవేశించును.]

వీర—ఇదిగో! విష్ణుశర్మ వచ్చుచున్నాఁడు ఇతనితో ముచ్చటించెద.

[ప్రవేశము: విష్ణుశర్మ.]

వీర—విష్ణుశర్మా! ఇచ్చట నీ కనుకూలముగ నున్నదా?

విష్ణు—మీమూలమున ధన్యుఁడనైతిని. పుణ్యనదీస్నానము, పురాణశ్రవణము, సాధుజనసేవ. ఒక టేమి, సర్వవిధముల ననుకూలమే!

వీర—విష్ణుశర్మా! నీభార్య నెప్పుడైనఁ జూచివచ్చెదవా?

విష్ణు—అమ్మో! అమ్మో! భార్యయే. దానిపే రెత్తకు. నీకు నమస్కరించెద. అట్టిభార్య నాకుఁ గాదు - నా విరోధికిఁగూడ వలదు?

వీర—ఈమధ్య నామెకు జబ్బుచేసిన ట్లెవరో చెప్పిరే! ఎట్లున్నది?

విష్ణు—జబ్బుచేసినానసరే, అది చచ్చినానసరే! ఇంక దాని ముఖము చూడను. దానిపే రెత్తను. నాయనా! మనయాశ్రమమంతయుఁ గొన్నిదినములనుండి యెంతయో వింతగాఁ గన్పట్టుచున్నది. దీనికిఁ గారణ మేమై యుండును?

వీర—కారణ మేమున్నది? సద్గుణోపేత యగు సావిత్రి యిచటనుండుటయే

విష్ణు—ఔను, నిజము. ఆమె శాంతస్వభావము, ఆమె సౌశీల్యము, ఆమె దేవతారాధనము, ఆమె పతిభక్తి యెంతైన నుండునా? ఇంతటి యుత్తమురాలు గనుకనే లేఁబ్రాయమున నున్న క్షత్రి

యాంగన యని యైన నెంచక తాపసకన్యలే గాక వృద్ధతపస్వి నులు కూడ ఆమె నత్యాదరమునం జూచుచుందురు.

వీర—మిత్రమా! ఎంత వెఱ్ఱివాఁడవు! సత్ప్రవర్తనము కులవయో వ్యస్తులం బరిగణింపఁజేయునా? ఇంత యేల? ఆమె దర్శన మొన రించిన నెట్టివారికైన మాతృభావము కలుగుచుండును. ఇంతటి యుత్తమురా లుండుట యరుదు. ఆమె యిచ్చట నొకవత్స రమునుండి యున్నను నిన్న మొన్న వచ్చినట్లు తోఁచుచున్నది. నేఁటికి మూఁడుదినములనుండి నిద్రాహారములు మాని నిరంత రము సావిత్రీదేవి నర్చించుచున్నది. నేఁడే వ్రతసమాప్తి. మనముగూడ పోయి దేవీదర్శన మొనరింతము రమ్ము

[అని యిర్వురు నిష్క్రమింతురు.]

---

[సావిత్రీదేవి - పూజామంటపము - మునులు.]

[పూజాతత్పరయై సావిత్రి దేవిని ధ్యానించుచుండును.]

సావి—తల్లీ! సావిత్రీ! త్రిలోకజనని వగు నీశక్తి నెంతయని కొని యాడుదును? తొల్లి హరిహరబ్రహ్మేంద్రాదులకు నయితము అశక్యులై, మునుల బాధించుచు, హవిస్సుల మెక్కుచు, యాగములం జెడంగొట్టుచు, స్త్రీలంజెఱంబట్టుచు, జగద్ద్రోహ మొనరించి, లోకభయంకరులై ప్రవర్తించు శుంభనిశుంభాది దుష్టరాక్షసానీకంబుల క్షణమాత్రమున జయించి భువనముల కుపకృతిం గావించితివి. నీ మాయావిలాసమున లోకములనెల్లం గీలుబొమ్మలవలె నాడించుచుంటివి. త్రిమూర్తులకుఁగూడ నీ శక్తి తెలియఁజాల దన మానవకాంత నే నెంతటిదానను? దేవీ! నీవే నాకు శరణ్యము. నీ పాదరాజీవంబులనే నమ్మితిని. ఈదీనురాలి తప్పు మన్నింపుము. నా యాపదం దొలఁగింపుము, నన్ను రక్షింపుము.

మ॥ ఘన సంసారమహాంబుధిన్ బడి సుతంగ్రాహంబులం జిక్కి దు
ర్జనసాంగత్యతరంగసంతతుల నిం చ్చల్ దేలుచున్ మోహపం

క నిమగ్నాంగులు నొంచు నీ చరణనాళీకంబ గానలే కుంశీనర్
గనఁగా శక్యమె మానవాళులకు సౌఖ్యం బింతయుం శాంకరీ!
చ॥ కరము దురాత్ములై యకృత్యకార్య మొనర్చెడి దుర్జనావళుల్
కరములు మోడ్ప నెప్డయినఁ గాచెద వెంతయు వారిఁ బ్రేమమై;
నిరతము తావకీనపదనీరజయుగ్మముఁ గొల్చు చానకున్
వరము లొసంగి, ప్రోవవె యపారకృపామతిఁ దల్లి! శాంకరీ!

[అని ధ్యానముచేసి మునులకు ఫలము లొసంగును.
వా రాశీర్వదించి నిష్క్రమింతురు.]

సావి—నారదమహర్షి నేఁడు నాభర్త కేదియైన యాపదవచ్చునేమో యని తోఁచుచున్న దని చెప్పెనే! ఆ యాపద యెట్టిదై యుండునో నే నూహింపఁ జాలకుంటినిగదా! ఎంత దుర్భరము గాకున్న నా మహాత్ముఁ డప్పుడు నాకు మంత్ర ముపదేశించి సావిత్రి నర్చించు మనునా? నా కేమియుఁ దోఁపకున్నది గదా! ఇంకేది కర్తవ్యము? ఆపదలయందు ధైర్యముగ నుండుటయే యుక్తము. జగదీశ్వరి యగు సావిత్రీదేవికృపయు, మునుల యమోఘాశీర్వచనంబులును నాకుఁ దోడ్పడకుండునా? త్రిరాత్రోపవాస మొనర్చి సావిత్రీదేవి నర్చించితిని. నేఁడుమాత్ర మొకక్షణమైనను ప్రాణేశ్వరుని విడనాడఁగూడదు. నాథుఁ డపుడే కందమూలాదుల కడకికి వెళ్ళెడినసమయము కావచ్చినది. హృదయవల్లభునితో నే నటవీప్రయాణంబుఁ జేసెద.

[అని ముందునకు వచ్చుచుండును]

సత్య—[ప్రవేశించి] [స్వ] నాదేవి సావిత్రీదేవి నర్చించి యిటే వచ్చుచున్నది [ప్రకా] ప్రియసీ! నీపూజావిధాన మంతయుఁ జక్కఁగ నెఱవేఱెనదా?

సావి—అంతయు నెఱవేఱెనది. ఆర్యపుత్రా! నమస్కారములు. దేవా! యిది సర్వశుభప్రదం బగు సావిత్రీదేవి ప్రసాదము. ఇవి మునిమంత్రపూతములై శ్రేయోదాయకంబు లగు పవిత్రాక్షతలు [అని యియ్య సత్యవంతుఁడు గ్రహించును.]

సత్య—దేవీ! ఇంక నే నడవి కేగి మనకుఁ గాఁదగు వస్తుజాలమును గైకొని వచ్చెద. నీ పనులయందు నీవు ప్రవర్తింపుము.

సావి—దేవా! ఈ దీనురాలి ప్రార్థన మొండు గలదు.

సత్య—దేవీ! అది యెద్ది?

సావి—ప్రత్యహమును దాము కందమూలాదులఁ గైకొనివచ్చు వన విచిత్రములఁ జూడ వేడుకవొడముచున్నది. అభీష్టము నెఱ వేర్పఁ బ్రార్థించెద.

సత్య—దేవీ! కోరక కోరక యెట్టికోరికను గోరితివి? ఇదియా, నీకు సమయము?

మ॥ జలమేనిం గొనకుండ మూఁడుదినముల్ • సాగించి తేమో వ్రతం
బులునుం జాగరణంబునుం విధిగఁ బూఁ • బోఁడీ! శ్రమంబంది బి
ట్టలసెం నీసుకుమారదేహ మని మ • త్స్వాంతంబునందెంతో చిం
తిల, నుగ్రాటవి కీవు వత్తు నన నిం • తీ! యెట్లు గొంపోవుదున్?

చ॥ కనదురుహీరహారములఁ • గాంక్ష యొనర్ప వొకప్డు; చిత్రవుం
బనిగల మేల్దుకూలములు • వాంఛ యొనర్పవు; తల్లిదండ్రులం
గనఁ జనఁగోర వెన్నఁడును; • గాన వసించియుఁ గానఁజూడ భు
క్తిని విడి డస్సియుం బయలు • దేరెదవే? దివి కేగుచుంటివే!

ప్రేయసీ! అటవీసంచార మన లీలోద్యానవిహార మనుకొంటివా? త్రిరాత్రోపవాసమున నలసిన నీ వెక్కడ? క్రూరమృగ శరణ్యం బగు మహారణ్య మెక్కడ?

సీ॥ పొలసురక్తము గండ • ముల నిండ మెయి సాఁచి
శయనించు శార్దూల • చయము లొకట
గండూతిపో వేళ్ళు • గదల రాయుచుఁ జెట్ల
పండ్ల రాల్చెడు గజ • ప్రతతు లొకట
జుమ్మున మధుపముల్ • కొమ్మ లూఁపుచుఁ దేనె
లీలఁ గ్రోలెడి బిల్ల • పాళు లొకటఁ
బూకలి మడుంగులం • ముస్తలెత్తుచు నొడ్డు
గోరాడు భూదార • కోటు లొకటఁ

గలిగి మీను మన్ను నేకమై • కన్ను లున్న
నంధులను జేయుచుండి ది•వాంధములకు
ముదముఁ గూర్చెడు కాంతార•భూము లేడ,
యుపవసించి కృశించిన • యువిద యేడ?

సమీపమున నున్న వనమున కేమి? ఎప్పుడయినఁ జూడ వచ్చును. ఇప్పటికి నీ ప్రయాణము మానుము.

సావి—ఆర్యపుత్రా! నేఁడు మాత్ర మన్యథా చెప్పకుఁడు. నా ప్రార్థన మంగీకరింపుఁడు.

మ॥ అనురాగంబునఁ జేసి యీ కరణి నా • కాయాసమం చెంచితో
మనుజాధీశ! శ్రమంబు లే దిటులు ప్రే•మల్ నూపు మీతోడ ని
వ్వనమం దుండిన స్వర్గవాససమమై • భాసిల్లెడు న్నాకు; నీ
చన వీయంగదె చూడఁ బుష్పితలతా•సంవేష్టితంబౌ వనిన్.

కాన నా ప్రార్థన మంగీకరించి యభీష్టము నెఱవేర్పుఁడు.

సత్య—ప్రియసీ! నిద్రాహారములు లేక మూఁడు దినములనుండి యలసితి వని యిట్లు పలికితిని గాని, లేకున్న నీ వింతగాఁ గోర వలెనా? నీ యీ కోరికనైనఁ దీర్పకుందునా? మనోహారిణీ! నీ యభీష్టమును నెఱవేర్తును రమ్ము.

[అని యిరువురును నిష్క్రమింతురు.]

[వనప్రాంతము - సావిత్రీసత్యవంతుల ప్రవేశము ]

సత్య—ప్రేయసీ! అటు చూడుము.

సీ॥ చఱియలపై నుండి • దొరలెడి సెలయేళ్ళ
మ్రోతఁ లుఱుములభంగి • మ్రోయు నచట
తద్ధ్వానమున నుబ్బి • తమ పింఛముల విప్పి
కెరలి కేకలు వెట్టు • కేకు లిచట
ఆ కేకలకు గుండె • లవిసి బెదరుచుఁ బ్రాణ
భీతిఁ బర్విడు జెట్టి•పోతు లచట
ఆ జెట్టి మెయిసోఁక • నట్టూకలిం ద్రావు
పాల్విడి చను మృగా•ర్భకము లిచట

అమ్మృగార్భక పాదసం•హతి గలంగి
బొమలు ముడివెట్టి, వానిమూం•పులను దట్టి,
యెగిరి, పడి, లేచి, మఱిమఱి • యెగురఁబోవు
పిల్లకోఁతులఁ గను మవే • పల్లవోష్ఠి!
ఈ ప్రదేశములు దుర్గములుగ నుండును. కాన యిటు
పోవుదము. [ పరిక్రమించి ]

సత్య—దేవీ! ఇటు చూడుము.

సీ॥ పాఁచిపట్టినయట్టి • పాషాణతల మిది
యడుగులు మెలమెల్ల • నిడఁగవలయు
నిప్పుడిప్పుడె కోసి • రియ్యెడ దర్భలు
ముందుఁ జూచి పదంబు • మోపవలయు
ఫలభారమున వృక్ష•పాళి యియ్యెడ వంగె
నించుక తలవంచి • యేగవలయు
ఇరుకెలంకుల దారి • నొరసె బండలు తీవె
లవలంబనముచేసి • యరుగవలయు
అన్నపానీయములు లేక • యలసియున్న
యబల వీ వెడ నడువఁ బ్ర•యాసపడెదు
భుజము మెడవైచి కేలూఁని • ముందు నడువు
మదిగొ! కన్పట్టు రమ్యవ•నాంత మతివ!

[అని చేయిపట్టుకొని సావిత్రినిఁ దీసికొనిపోవును.
తిరిగి వనమున సావిత్రీసత్యవంతులు ప్రవేశింతురు.]

సత్య—ప్రేయసీ! ఈ నదీవైభవమును జూడుము.

శా॥ రంగత్తుంగతరంగడోలల నొయాం•రంబారఁ దూగాఁడు చ
క్రాంగశ్రేణులఁ, గైరవాబ్జదళనైక•క్రీడలం దేలు సా
రంగౌఘంబుల, వాలుకా కుసుమ పం•ర్యంకంబులన్ మేను లు
ప్పొంగం గూడెడు కోకదంపతుల, నో•పూఁబోఁడి! కన్గొంటివే?

సావి—నాథా! ఇం దెందు జూచినను మహానందమే కలుగుచున్నది
కదా! ప్రేమాతిశయమున మెలఁగు దంపతులవోలె వృక్షములఁ

బెనంగిన లతాచయంబులును, లతలకుఁ బ్రాపు నూపు వృక్ష రాజంబులును, యోగ్యులైన గృహస్థులవోలె నిందుండి పుష్పంధయబంధుసంతానంబునకు మధురాహారం బొసంగుచు, శుకాది ద్విజచయంబులకు ఫలప్రదానము సేయుచు ఖరకరకిరణంబులకు డస్సిన మృగపాంథులకు నీడ నొసంగుచు, సంతతానందం బొసంగు నీ వృక్షరాజంబుల పరోపకారపారీణత యెంతయు మెచ్చఁదగినది కదా! [ముందుఁ జూచి] ఆర్యపుత్త్రా! ఈ ప్రదేశ మెంత సంతస మొదవించుచున్నది!

గీ॥ పక్వమై జారిపడు తేనె•పనసతొనలు
 వృంతముల వీడి రాలెడు • వెలగపండ్లు
 దొరలి పొరలాడు పోకపొ•త్తులను జూడఁ
 బుడుక కాకైనఁ, గాలంబు • గడుచు నిందు.

సత్య—ఈ ప్రదేశము లిట్టివి కనుకనే మనవా రెల్లరు స్వచ్ఛందజీవనులై, యహింసావ్రతపరాయణులై, స్వర్గమునైనఁ గొనఁజాలు తపోధనాగ్రగణ్యులై ప్రవర్తింపుచున్నవారు. ఈస్థలవిశేషముల నన్నింటిని వేఱువేఱుగఁ జూపించెద. [అని సావిత్రిచెయిఁ బట్టుకొని]

సీ॥ అనయంబు ననలార్చ•నాది కృత్యములకు
 దర్భలు కోసెడి•తావు లివియె
నర్వర్తువులయందు • నంయమిబాలురు
 ఫలమూలములఁ దెచ్చు•పొలము లివియె
ప్రత్యహంబును రమా•రమణు పూజలకునై
 పుష్పముల్ దొరకెడు•భూము లివియె
దినదినంబును వైశ్వ•దేవాదివిధులకు
 నివ్వరి లభియించు•నెలవు లివియె
 జంబు జంబీర ముఖ్య భూ•జంబు లవియె
 ప్రథితదివ్యౌషధీలతా•పాళి యదియె
 కాననినివాసులకుఁ గల్ప•కంబు నైన
 యడవి యియ్యదె కనుఁగొను • మంచయాన!

మనోహారిణీ! ఈ ప్రక్క నవలోకింపుము.

గీ॥ పద్మినీపత్రివదన, శైవాలవేణి,
శఫరవీక్షణ, బిసబాహ, సారసాస్య,
క్రౌంచమేఖల, యీ సరఃకాంత మనకు
స్వాగతం బిచ్చు షట్పదస్వనముచేత.

సావి—ఆర్యపుత్త్రా! ఈ కమలాకరము కమలాకరం బనఁదగి నయనా నంద మొదవించుచున్నది. ఇందలి సరసీరుహంబులఁ గోసికొని వచ్చెద.

సత్య—ప్రేయసీ! నీ యభీష్టముం దీర్ప నే నిందు సంసిద్ధుండనై యుండఁ, గంటకోపేతంబులగు మృణాలంబుల స్పృశించి చూత పల్లవంబులం బోలు నీ మృదుకరంబుల కేల బాధఁ గలిగించె దవు? అపరిచితురాలవైన నీ కేల యీ ప్రయాసము? నేనే తెచ్చి యిచ్చెద. [అని సరోవరముకడ కేగును.]

సావి—ఆహా! నా హృదయేశ్వరుండు నా కరంబులు సైత మెక్కడ కసుకందునో యని విచారించుచుండెనే కాని తనకు రానున్న యాపదను దెలియఁజాలకున్నవాఁడుగదా! ఆపదలు వచ్చుట కెన్ని మార్గములు లేవు? ఈ సరోవరమే యాపత్కారణము కాదుగదా! [ఆతురతతో] ఆర్యపుత్త్రా! ఆర్యపుత్త్రా! [అని పిలుచును.]

సత్య—ఇదే వచ్చుచున్నాను. [అని తామరపువ్వులు ఆకులు గ్రహించి ప్రవేశించును.] దేవీ! ఇవిగో తామరాకులు; ఇవిగోపుష్పములు. [అని యొసఁగి] సఖీ! దీని పత్రములు నీ కనుల కొకింత యీడు గావచ్చునేమో చూడుము. [ఒక పుష్పదళమును గ్రహించి] మనోహారిణీ! ఇది యతిమనోహరముగ నున్నది. దీనిని ధరిం పుము. [అని సావిత్రి శిరమున నుంచి, సంతసముతో] సుందరీ! ఇప్పుడు నీవు నిజముగఁ బద్మపాణివై పద్మధారిణి వగుటచేత సాక్షాల్లక్ష్మివలె నాకనుల కానందమును గూర్చుచున్నదానవు.

సావి—[మరియొక పువ్వును జూచి] ఆర్యపుత్త్రా! ఇందలి పత్రము లెల

మనోజ్ఞములుగ నున్నవి! [చూచి] నాథా! మధుమదిరాస్వాదన
మున నీమధుకర మిప్పటికినిఁ దన స్థితి నెఱుంగకున్నది కదా!

సత్య—దేవీ! తనస్థితినే కాదు, తనకై విలపించు ప్రియురాలిస్థితిని
గూడ! దాని కదపకుము! నీ మోము దమ్మిపై వ్రాలి బాధ
కలిగించును.

సావి—[ఆడుతుమ్మెదను జూచి] ప్రియవల్లభునికై యా మధుకరాం
గన యాతురయై తిరుగుచున్నది. ప్రియవియోగ మెందును
దుస్సహమేకదా!

సత్య—సందియ మేమి?

సావి.—[ముందుఁ జూచి] ఆహా! ఎంతకష్ట మెంతకష్టము! నాథా!
అంకపాళి నున్న ప్రియవల్లభుని శ్యేనము హరింపఁ బతివియోగ
మునకై కలకవాంగన విలపించుచు నెంతదూర మరిగెనో
చూడుము. [ఆకసమువంకఁ జూపి]

గీ॥ అక్కునం జేర్చి ప్రియమార • నాదరించు
ప్రాణపదమగు పతి మృత్యు•వాతఁ బడఁగఁ
గాంత వెను వెంటఁ జనుటె ము•ఖ్యం బటంచు
విహగమైనను స్త్రీధర్మ•విధముఁ జెప్పు.

[సంతసముతో] ఆర్యపుత్త్రా! ఆకసము బొబ్బరిల్ల విల
పించుచుఁ బతివెంట వచ్చు కపోతిపై దయ జూపు దానివలె
నాడేగ పారావతమును విడిచి చనుచున్నది.

సత్య—ఔను, మఱల నా పారావతమిథునమును దైవ మనుగ్రి
హించినాఁడు. సౌఖ్యములు క్షణభంగురములు కదా! పాప
మా తుమ్మెద విలపించుచు నిటు వచ్చుచున్నది. నిద్రాళు
వైన దీనిని సతితోఁ గలుపుదము. [అని కమలము కదల్చును.
తుమ్మెద లేచిపోవును.]

సావి—నాథా! ఆ భృంగి యా భృంగసాంగత్యమున మోద మెనఁగఁ
జరించుచున్నదినుమా!

సత్య—ప్రియసమాగమ మానందకరము కాదా! ప్రేయసీ! ఈ
ప్రక్కఁజూడుము.

సావి—నాథా! మీ యనుగ్రహవిశేషమున దర్శనీయప్రదేశము నెల్ల సందర్శించితిని. కాఁదగిన పత్రపుష్పాదులనెల్ల స్వీకరించితిమి. ఇటు చూడుఁడు. నేలపై నడుచు కూర్మరాజమ్ముల కరణి చెట్లనీడలు మూలముల కెగఁబ్రాఁక మృగచయంబులు రొప్పుచుఁ బ్రిక్క లెగురవేయుచు దర్భాంకురంబులు ముఖంబుల మెఱయ లాలాజలోత్కీర్ణమార్గంబులై యెల్లెడలఁ బరుగులిడుచున్నవి. వనమహిషంబులు ముచ్చెమటలుగ్రమ్మ నూనె పూసిన యేనుంగుగున్నలకరణిఁ గొలంకుల కరుగుచున్నవి. ఖరకరకిరణంబుల కోర్వఁజాలక వరాహంబు లల్పజలాశయంబులం బడి పొరలుచున్నవి. నిర్మలజలపూరంబువోలె నెండమావు లెల్లయెడల వ్యాపించి మృగచయంబుల కాసఁ గొల్పుచు మధ్యాహ్న మాసన్నమైనది. మీజననీజనకులు మనకై యెదురు చూచుచుందురు. ఇంక నాలసింపక పర్ణశాల కరుగుదము, రండు.

సత్య—ప్రియసీ! నీ వీ వనవిచిత్రములఁ జూడ నపేక్షించుటవలనఁ గాలయాపన మొనరించితిమి; ఇదిగో, ఇచట— [ అని యొక్క ప్రక్కఁజూచి, ఆశ్చర్యముతో ] ఆహా! ఏమి యీవైపరీత్యము, ఏమి యీ యకాలమేఘము, ఎంతలో నెంతవరకు వ్యాపించినది? దినకరమండలమును గూడ నరికట్టుచున్నదే! దేవి! ఇటు చూడుము.

సీ॥ కంపితాఖిలలోక•గర్జానినాదముల్
ఘనదంతఘట్టన•క్రమము గాఁగ
నిర్వాపితాంజన•సర్వాఁగరోచిల్లస
త్కాళిమ నిజదేహ•కాంతి గాఁగఁ
దరళీకృతాలోక•దంభోళిపుంజముల్
గళదుగ్రవిస్ఫులిం•గములు గాఁగ
సౌవర్ణవల్లరీ•జాలభాస్వరచంచ
లాలత లాయుధ•పాళి గాఁగ

అఖిలభూధర నర మృగ • వ్యాప్త సప్త
సాగర పరీత మగు జగ • జ్జాల మెల్ల
కబళనము సేయ వచ్చు • కాలకాలు
కరణి మేఘంబు భూనభో •ంతరము నిండె.

[పరికించి] ఆహా! ఒకమేఘమే కాదుసుమా; దేవీ! ఇటు చూడుము.

గీ॥ ఒగుడువలె మింటఁ బెన్గొమ్మ • లెగయుచుండె
వెదురుపొదలెల్ల నుడివడి • వీఁగుచుండెఁ
బెళ్ళు మని జీర్ణవృక్షముల్ • ద్రెళ్ళుచుండెఁ
గొండలం గూల్చు నన • గాలి కొట్టుచుండె.

ప్రేయసీ! ఈ దుష్టానిలుఁ డీ ప్రదేశము నెంత క్షోభఁ బెట్టు చున్నాఁడో చూడుము.

సీ॥ చెట్లగున్నల క్రిందఁ • జేడియ మెయి నాకి
సంతసించెడు లేడి • జంటఁ బాపి
పువ్వుపళ్ళెరములఁ • బొలఁతులఁ దాఁగించి
మధు వాను తేంట్లకు • వ్యథలు గూర్చి
పిల్లలకుఁ గ్రమ్మ మేఁతఁ • బెట్టి తరుణులఁ గూడు
ఖగకుటుంబములఁ జీ • కాకుఁ బఱచి
పల్లవహస్తముల్ • బరపి లతాకాంత
లాంచు సహకార • లీలఁ దూల్చి
గుంపులుగ నున్న కదళులఁ • గూలఁద్రోసి
బారుగట్టిన గువ్వలఁ • బాఱఁజిమ్మి
యఖిలముఁ గలంచి యీ ప్రచం • డానిలుండు
పుడమి సకలంబు శోకాబ్ధి • ముంచె నహహ!

సావి—[ఆతురతతో] నాథా! ఇంక నాలసించిన యత్తమామలు మనకై విచారపడుచుందురు; పోదము, రండు.

సత్య—దేవీ! ఇదిగో; ఇచ్చట బాగుగ నెండిన కొమ్మ యొండు కలదు. దానిని భేదించుకొని వచ్చెద. పిమ్మటఁ బర్ణశాల కరుగుదము.

సావి—అట్లే కానిండు.

సత్య—[గొడ్డలి నెత్తి కొమ్మను గొట్టుచుండును.] ఏమీ! యీశిరోబాధ? యెంత తీవ్రముగ నున్నది! [బాధ నభినయించి మఱలఁ గొమ్మను గొట్టుచుండును.]

సావి—[స్వ] ఏ మిది? ఆర్యపుత్త్రుఁడు సంశయించుచున్నాఁడు. [సమీపమునకుఁ బోవును.]

సత్య—దుర్భరము, దుర్భరము! [అని గొడ్డలిని వదలును.]

సావి—[సమీపించి] నాథా! నాథా! ఏ మిది? గొడ్డలి వదలి శిరము పట్టుకొంటిరే?

సత్య—దేవీ! నే నడువఁ జాల, నే నిలువఁజాల. నాకుఁ జేయూఁత నొసంగుము. స్వాస్థ్యము కలిగింపుము.

సావి—[దైన్యముతో భర్తను బట్టుకొని యుపచారము సేయుచుండును.]

సత్య—హా! దుర్భరము! దుర్భరము! [అని క్రిందఁబడును.]

సావి—నాథా! నాథా! [అని పిలుచును.]

సత్య—[కాలు సేతులు కదలించుచు నిశ్చలదృష్టితో హీనస్వరమున] బాధ - బాధ - తాపము - తాపము - భరింపఁజాల - భరింపఁ జాల.

సావి—[నిర్విణ్ణురాలై] ఏమి యీ తొట్రుపాటు! ఏమి యీ భయంకరాకారము! ఏమి యీ వికారచేష్టలు? జీవితేశ్వరా! జీవితేశ్వరా! నన్ను చూడుము. [అని పిలిచి చూచి భయకంపములతో] ఏమి యీ యేకాగ్రదృష్టి! ఏమి యీ స్వేదము! ఏమి యీ కంపము! [కాళ్ళు చేతులు పట్టి చూచి] నాథా! నాథా! [అని పిలిచి దుఃఖముతో] అయ్యయ్యో, దైవమా! నాథుని శరీర మంతయుఁ జలినీళ్ళకుండవలెఁ జల్ల నగుచున్నదే! ఇం కెక్కడి నాథుఁడు? ఇం కెక్కడి పర్ణశాల? మహామునివాక్యములు వ్యర్థము లగునా? చూడఁ జూడ నామనోదైవమునం దన్నియు మరణచిహ్నములే కన్పించుచున్నవే! ఇం కేమి

చేయుదును? ఈ మహారణ్యమున నీ బాధఁ తొలఁగించి పతి భిక్షఁ బెట్టి నన్ను రక్షించువా రెవ్వరు గలరు? [సత్యవంతుని ముక్కుదగ్గఱఁ జేయియుంచి] హా! హా! నిశ్వాసము కూడ తగ్గుచున్నదే! జీవితేశ్వరా! నీ కప్పుడే నూరేండ్లు నిండెనా? న న్నెప్పుడు కనులఁ గప్పుగొనుచుఁ బ్రేయసీ! కందమూలాదుల కడవికి వెళ్ళినప్పుడు నయితము నామనము నీ యందే యుండుననియు, నా మానసాపహారిణి వనియు నా కెన్నియో ప్రియములు పల్కుచుందువే! మృణాళముల ముట్టిన నా కర ములు కందునంటివే! అట్టి నీప్రేమ మేమి చేసితివి? శిరంబునఁ గమలపత్రముం దుఱిమి, దేవీ! ఇప్పుడు సాక్షాల్లక్ష్మివలె నుంటి వని సంతసించితివే! అట్టి సంతోష మెందు దాఁచితివి? కావ్య రసామృతమున నోలలాడించుచు నాధ్యాత్మికతత్త్వము నెఱిం గించు నీ యనురాగము నెచ్చటికంపితివి? నాథా! సంతతము భజించు నీ దాసురాలిని, నీ మనోహారిణిని, నీ యర్ధాంగినిఁ గనులనైనఁ జూడకుంటివే. అయ్యో! ప్రాణేశ్వరా! రావలదన్న వచ్చితి నని యలుకఁ బూనితివా? క్షణమైన నేమఱక సంర క్షించు ముదుసళ్ళఁ దలిదండ్రుల నేమి చేయందలంచితివి? దైవ మా! నీ వెంతటి క్రూరుఁడవు! సుగుణరత్నాకరుండును, సాధు చరిత్రుండును, మాతాపితృసేవాతత్పరుండును, సర్వసర్వంసహా రక్షణదక్షుండును, నిరామయుండును నగు నామనోనాయకుఁడే నీ కగపడెనా? నాథా! నీ సత్యాదరము, నీ పితృభక్తి, నీ సత్కర్మాచరణపరాయణత్వము నీకు స్థిరజీవనహేతువు లని సంతసించితినే! అమ్మా! సావిత్రీ! సకలలోకజనని వగు నీవు నా పట్లఁ గలిగియుంటి వని నీయండఁ జూచుకొని తండ్రితోఁ బోరాడి యీ మహాభాగుని వరించితినే. తల్లీ! నీ వైన నుద్ధ రింపవుకదా! పతిభక్తిగల కాంతలకు భర్తృవియోగదుఃఖ ముండ దని నమ్మి సూర్యచంద్రాదులును బంచభూతములును సాక్షిగా నా నాథునిఁ గొల్చుచుందునే! పతివ్రతా మమోఘ వచస్కులగు మునుల యాశీస్సులఁ బడయుచుందుమే; యవి

మైన నష్టపడఁగూడదా? మహానురాగముగల నాయత్తమామ
లకుఁ బుత్త్రశోకము వినిపింపఁజాల. వివాహకాలమున వల దని
వారించిన నా తండ్రికి ధైర్యము చెప్పఁజాల. ఛీ! ఛీ! భర్తృ
వియోగమునకన్న వనితలకు మరణము మేలు గాకుండునా?
అయ్యో! శోకాగ్ని నాహృదయమును గాల్చివేయుచున్నది.
[భర్తను జూచి] నాథా! నీకష్టమున కే సహింపఁజాల; నీవియో
గమున కే నోర్వఁజాల; నీ సేవ విడువఁజాల. నిన్ను వదలఁ
జాల. అత్తమామలారా! ఇంక మా యాస వదలుఁడు. జననీ
జనకులారా! ఇంక మమ్ము మఱవుఁడు. యమధర్మరాజా! ఓ
యమధర్మరాజా! నన్నుఁగూడ నానాథునితోఁ దీసికొనిపొమ్ము.
[అని సత్యవంతునిమీఁదఁ బడి దుఃఖించును.]

[అంతట యముడు ప్రవేశించును.]

యముఁడు—[స్వ] నేను స్మరణమాత్రాశేషజీవలోకభయంకరుండ
నని కనియుఁ, జతుర్ముఖప్రసాదితప్రేతలోకసామ్రాజ్యాధి
నాథుఁడ నని తెలిసియు, నాత్మీయకార్యసాధనదీక్షాపరతం
త్రుండ నని యెఱింగియు, నన్నా నారదుండు పరిహసింప
సాహసించెనే? కాని నే నెట్లు కృతకృత్యుండను గాకుందునో
చూచెద. [అని సావిత్రీసత్యవంతుల సమీపించి సావిత్రినిఁ
జూచి] ఓహో! ఈ యమ మహాతేజశ్శాలినియై విరాజిల్లు
చున్నదే; కానిమ్ము. నా విధి నే నిర్వర్తించెద. [అని సత్య
వంతుని సమీపించును.]

సావి—[కనులు విచ్చి చూచి యాశ్చర్యముతో] ఆహా! నీలనీరదసమ
గాత్రుండు, కాంచనాంబరధరుండు, చలద్రక్తనేత్రుండు, దీర్ఘ
దంష్ట్రాకరాళవదనుండు, బాహుపరిఘాసమన్వితుండు, మ
హోరస్కుండు, పాశాంకుశహస్తుండు, భయంకరాకారుండు
నైన యీమహానుభావుం డెవ్వఁడై యుండునో? ఈతఁ డెందుల
కేతెంచుచుండెనో? [యోజించి] అయ్యో! మీ రెవ్వరు?
ఇచ్చటికి వచ్చుటకుఁ గారణ మేమి? తమయాగమనంబుఁ జూడ
విపత్సముద్రనిమగ్నుల మగు మ మ్ముద్ధరింప నేతెంచిన దేవుఁడ

వనియే తలంచుచున్నదాస. నానాథుఁ డకారణముగఁ దీవ్ర శిరోవేదనచే నిట్టి యాపదకుం జిక్కినాఁడు. దయయుంచి పతిభిక్షఁ బెట్టి న న్నుద్ధరింపుము. [అని నమస్కరించును.]

యము—[స్వ] ఆహా! మానవదృష్టి కగోచరమగు నా యాకృతి నీమె యెట్లు చూడఁగలిగె? పాతివ్రత్యమే కారణమైయుండునా! కానిమ్ము. [ప్ర] రాజపుత్త్రి! సమస్తజీవుల పాపపుణ్యానుసర ణంబుగఁ దత్తత్ఫలంబుల నొందుటకై నియమింపఁబడిన యమ లోకంబున కధిపతిని.

సావి—[దుఃఖముతో] అబ్బా! ఇం కేమి చేయుదును? ఇఁక నా నాథు నెట్లు దక్కించుకొందును?

యము—మఱియు, నో సాధ్వీమణీ!

చ॥ క్రతువులొనర్చువారల, నిరంతరసూనృతవాక్యపాలురన్,
సతతసురార్చనారతుల • సద్వ్రతలోలుర, దానశీలురన్,
బితృపదభక్తియుక్తులను • భీతిని మద్భటు లేగి చూడలే;
రతులితచండభానుతరుణాంశులఁ జీఁకటు లాపనోపునే!

నీ నాథుండు సుగుణరత్నాకరుండై, సత్కర్మాచరణ పరా యణుండై, సత్యవంతుం డని సార్థకనామధేయుం డగుటవలన నేనే వచ్చితి. ఇఁక నాలసింపరాదు.

[సత్యవంతుని సమీపించి పాశము వేయును]

సావి—అయ్యో! దైవమా! ఇంకొకక్షణములో నీ ప్రేతపతి నాపతి ప్రాణములఁ దీసికొనిపోవునే! సమస్తపాపసంహారిణి వగు నో సావిత్రి! భక్తోద్ధరణదీక్షాపరతంత్రి వగు నో సావిత్రి! సేవకా భీష్టప్రదాత్రి వగు నో సావిత్రి! ఈ సావిత్రి నీ వరప్రభా వంబునఁ బుట్టియు నిట్టి మహాపద ననుభవింపవలసినదిగనే యయ్యెనా? అయ్యో! నా కిప్పట్ల సాయమువచ్చి నాపతిని బ్రతికించువా రెవరు? ఓ పంచభూతములారా! నా నాథుని జీవితునిఁగాఁ జేయుఁడు ఓ వనవృక్షములారా! నా మనోదయి తుని ప్రాణముల నీ కాలుండు దీయకుండఁ గాపాడుఁడు ఓ వనవృక్షములారా! ఓ ఖగములారా! ఓ సరోవరములారా!

నా జీవితేశ్వరు జీవంబుల నీ ప్రేితపతి హరింపకుండ సాయము చేయుఁడు. [యమునివంకఁ జూచి] అయ్యో! యమధర్మ రాజా! న్యాయాన్యాయపరిపాలకుండ వగు నీ వింతటి ఘోర కృత్య మొనరించుటకు నా భర్త యంతటియన్యాయ మేమి చేసె? హా! హా! అయఃకంటకభరితంబైన నీకఠినతరపాశంబుల నాపతి యెంత నొచ్చెనో, యెంతటి కష్టంబు లనుభవించు చుండెనో, ఎంత దుఃఖ మనుభవించుచుండెనో? అయ్యా! ప్రేితనాథా! నిన్ను బ్రార్థించెదను. నీ పాదంబులకు మ్రొక్కు దును. నీకు దోసిలి యొగ్గుదును. దేవా! నాపతిని విడిచివనుము. తండ్రీ! నన్ను దయఁగనుము. నా భర్తను బ్రదికింపుము. న న్నుద్ధరింపుము. [అని పాదములమీఁదఁ బడును. యముఁడు నిష్క్రమించును.]

సావి—[నిర్వేదముతో భర్తను జూచి నలుదిక్కులు పరికించి యముడు పోవు మార్గమును గనుంగొని] అయ్యో! యముం డరుగుచుండెనే ఇం కేమి చేయుదును? ఓ వనదేవతలారా! నా పతిశరీర మేదుష్టమృగములు ముట్టకుండఁ గాపాడుఁడు. ఓ సూర్యచంద్రులారా! నాభర్త దేహము నెవ్వరు స్పృశింప కుండఁ జూడుఁడు. ఓ సావిత్రీ! నా నాథుని కళేబరమున కే యపాయము కలుగకుండ రక్షింపుము. యమధర్మరాజా! దూర మరుగకుము. నాథా! నాథా, వచ్చుచున్నాను. [అని సావిత్రి నిష్క్రమించును.]

[మహారణ్యప్రాంతమున యముఁడు ప్రవేశించును.]

యమ—చరాచరపరీవృతం బగు నీ ప్రపంచమందుఁ బ్రతిజీవికిని బ్రాణమునకన్న నుత్కృష్టమై రక్షణీయ మగు పదార్థము వేఱొండు లేదు. అట్టి ప్రాణాపహరణకృత్యము, సాహసమై యతిక్రూరమైనను విధివిహితం బగుట నా కవశ్యాచరణీయమై సతీసుతవియోగకారకుండ నను లోకనిందకుఁ బాత్రునిఁ జేయు చుండును. కాని న్యాయమార్గప్రవర్తకులై, ధర్మానుష్ఠానపరా యణులై, సత్యమూర్తు లనంబరగిన నిట్టిసాధుచరిత్రుల యుత్త

మ పాణిపహనమున నాపదవి యత్యుత్తమమై ధన్యమైనదని నే సంతసింపవలసి యున్నది. [వినుట నభినయించి] ఎక్కడి వీ దీనాలాపములు! [పరికించి] ఏమి యీ సాహసము! ఈ సావిత్రి యెన్నియో మహారణ్యముల నిర్గమించి వచ్చుచున్నదే! పతివియోగము దుస్సహము కదా! కానిమ్ము. ఈపరిదేశ ములు దుర్గమము లని చెప్పి వారించెద.

సావి—[తెరలో] నాథా! నాథా! ఎందుఁ బోయితివి? నీ దివ్య మంగళమూర్తినిఁ జూపింపుము. నీ పాదార్చన సౌభాగ్యమును సమకూర్పుము. హృదయేశ్వరా! నా మొఱాలింపుము. నన్నుఁ గరుణింపుము. [అనుచు సావిత్రి ప్రవేశించును.]

యము—సావిత్రీ! ఏమి నీ ధైర్యము? నీవే యింత సాహసమునకుఁ బాల్పడియెదవా?

మ॥ ఇవి యుగ్రాటవిభూము, లిందు వనమ◆త్తేభంబులుం దుర్మదో
గ్రవరాహంబులు, సింహముఖ్యమృగము◆ల్గంపంబుగల్పించు, రా
త్రివరుల్ దోఁచెడు నంధకారమున, నం◆దేకింబునన్ రాక్షసుల్
పవలే పాంథులఁ జంపుచుందు రిట రా◆భావ్యంబె యోకోమలీ!

ఇచ్చటనుండి వెనుకకు మఱలుము. ఈ పరిదేశములు భయంకరములై యెట్లు గన్పట్టుచున్నవో చూడుము.

సీ॥ సన్ననూదులు గుచ్చు◆కొన్నట్లు శిరముఁ బెట్టు
వల్లేరు పాకిన◆పథచయంబు
ఈఁగ నైనను దూర◆నీయు కీచుక బిట్టు
గ్రమ్మి, భీతి నొనంగు ◆ గచ్చపొదలు
గాలి సోఁకినఁగాని ◆ గన్పని లేచుచుఁ
బడగలెత్తెడి త్రాచు◆పాముగములు
చెవులు చిల్లులువోవఁ ◆ బవలు రాత్రియు లేక
గీ యను నీ కీఁచు◆రాయి రవళి
తనువుసోఁకినఁ జైతన్య◆మును హరించి
హోరువెట్టుచు దిక్కులఁ ◆ బారు నదులు

గలిగి దుర్గమమైన మార్గంబి దేడ
భయము నందక నీ విందు వచ్చు టేడ ?

రాజపుత్రీ! శిరీష కుసుమ పేశల గాత్రివి నీ వీ యరణ్యములకు రాఁ జనదు నీ ప్రయాసవలన లాభము కలుగనేరదు. ఇఁక శీఘ్రముగ మఱలి చనుము.

సావి—ఆర్యా! తా మిట్లు పలికిన నే నే మందును? సాధ్వికిఁ బత్యనుసరణమే యుక్తమనియు, దంపతులలో నెవరు లోకాంతరమునకు ముందేగినను, రెండవవారు వచ్చువఱకు నిరీక్షించి పిమ్మట సుఖదుఃఖము లనుభవింతురనియు శ్రుతి స్మృతి పురాణాదులు చెప్పుచుండ నేను బతి నెడఁబాసి యెట్లు పోఁగలను ?

మ॥ పతి యెందేగిన, నాపరిదేశములఁ బోవంగ జెల్లదే సాధ్వికిం
బతిసేవాఫలముం, నిరంతరతపోమాహాత్మ్యముం, భక్తియుం
బ్రతపూజాచరణం బొకప్పుడును వ్యర్థం బౌనె? యాఁగాక; న
న్నుతిసేయందగు సాధుదర్శన మ దెందుం గోర్కు లీడేర్చదే?

దేవా! ధర్మమార్గప్రవర్తకు లగు సజ్జనులు సర్వదా వందనీయు లనియు, నట్టివారి దర్శనమువలన సర్వతాపోపశాంతి యగుటయే గాక, సకలాభీష్టసిద్ధి యగుననియుఁ బెద్దలు చెప్పుదురు. సకల ధర్మస్వరూపు లగు మి మ్మనుసరించుచుండ శ్రమ యెం దుండునా ?

యము—రాజపుత్రీ! మ మ్మనుసరించుటవలన ఫల మేమాత్రము గలుగ నేరదు. జీవుండు జన్మాంతరమం దార్జించిన పాప పుణ్యకర్మ విశేషమువలనఁ బశుపక్ష్యాది సకలయోనులయందుఁ బుట్టి ప్రాగ్భవకర్మానురూపమగు ఫల మనుభవించి దేహము విడుచుట సర్వజంతుసామాన్య మని నీ వెఱుంగని విషయము గాదు. నీ భర్త సకలవిద్యా విశారదుండై, నీతిమార్గ ప్రవర్తకుండై మాతాపితృ సేవాతత్పరుం డగు సాధుచరితుండు. ఇతం డీ దేహముచే ననుభవింపవలసిన దెద్దియును లేదు. ఈతండు యోగ్యుఁ డగుటవలన దేవతాశరీరమున నాలోకమునుండి పుణ్యలోకమున కేఁగఁగలఁడు. ఇదియునుంగాక చచ్చిన

వాఁడు బ్రతుకు నని నీ వెన్నఁడును వినియుండవు. సర్వ మెఱిఁగిన సాధ్వీమణికి నీకుఁ జెప్పఁదగిన దేదియును లేదు. కర్మఫల మెంతవారి కనుభవించక తీఱదు. కాన నీ వింకఁ ద్వరలో మఱలిపొమ్ము [ అని పోఁ బోవును. ]

సావి—దేవా! సకలధర్మస్వరూపుల రగు తా మిట్లు సెలవిచ్చిన నే నేమనఁగలదానను? మనోవాక్కాయకర్మంబుల నెవ్వరికి నపకార మొనరింపక దీనజనపోషణపరాయణులై, ఆశ్రితావనదీక్షితులై, పరోపకారపారీణులై, యాచకజనమనోభీష్టంబుల వెను దీయక నెఱవేర్చుచుండుట ఆర్యధర్మంబు లని విందుము. దేవా! తమ రెఱుంగని ధర్మరహస్యంబు లెందైన నుండునా? నమ స్తధర్మవేత్త వగుటచేతనేకదా, ధర్మదేవతా నామంబు ధరించి చరించుట? మఱియు నిష్పక్షపాతబుద్ధి సర్వభూతములకు శిక్ష విధించుటవలన యముఁడ వనియు, సర్వభూతహితుండ వగుటవలన సమవర్తివనియు నామములు దాల్చితివి. కాన నో దేవా! ఇట్టి మీచేఁ బాలంబడిన నాకుఁ దాపోపశమనంబై యభీష్టసిద్ధి కాకుండునా?

అంతియ కాక యేడడుగులు నడచి, యేడుమాటలాడిన నెట్టివారితోనైన మైత్రి లభించునని పెద్దలు చెప్పుదురు. సజ్జనవర్యులగు మీతో నింతదూరము నడచి యింతసేవు సంభాషించుటవలన మీ కాప్తురాల ననుటకు సందియము లేదు. పాపకార్యములనుండి తొలఁగించి హితమును బోధించి గుణముల వెలిఁబుచ్చి సౌఖ్యముల సమకూర్చుటయేకదా సన్మిత్రలక్షణము? తమ కాప్తురాలనైన నేనే తత్ఫల మనుభవింపకున్నప్పుడు ప్రపంచమున నెవ్వరైన సన్మైత్రి నపేక్షించెదరా? కాన నోదేవా! ఈదీనురాలి మొఱ వినుఁడు. అంధులై రాజ్యభ్రష్టులై మమ్ముఁ బ్రాణాధికముగఁ జూచుకొను వృద్ధులగు మా యత్తమామలు పుత్త్రశోకమును భరియింపఁజాలరు. మాకై యెంత విలపించుచుండిరో యని చింతించుచున్నదాన. అనుగ్రహించి నాయభీష్టము నెఱవేర్పుఁడు.

యము—సావిత్రీ! సకలధర్మసారమనఁదగిన నీ వాక్కు నిర్మలహిమాంబుపూరమునకన్నను, శరచ్చంద్రికా ప్రసారమునకన్నను సారవంతముగ నుండి యెంతయు సంతసమును గలుగఁజేయుచున్నది. నీ యత్తమామలపైఁ గల యాదరము మెచ్చఁదగియున్నది. నీ యత్తమామలకు నేత్రములతోఁబాటు మరల రాజ్యప్రాప్తికలుగునట్లు వరము నిచ్చితి. ఈవరములకు సంతోషించి మఱలిపొమ్ము. [అని యముఁడు నిష్క్రమించును.]

సావి—సజ్జనదర్శనమునకు ఫలము కలుగకపోదు. ఎన్నఁడు దలంపని మహోపకారము నా యత్తమామలకుఁ గలిగినది. సత్పురుషు లెప్పుడును దయార్ద్రస్వభావులు. పరులకష్టంబులఁ జూచి యోర్వఁజాలరు. కాన నా పతిప్రాణము లిచ్చువఱకు యముని విడనాడను. తల్లీ, సావిత్రీ! నీవే నాకు శరణ్యము

శా॥ నీవట్టుండఁ గొంఱంతయేమని మదిన్ • నీపాదముల్ నమ్మి, యీ
భూపాలుర్ వరియించితిన్ జనకుఁడా • మోదింపకున్నన్; ననున్
గాపాడంగల కాల మియ్యదియె; లో • కవ్రాతమున్ బ్రోచు నీ
కీ పాపన్ సనుఁ గాచు టెంతపని? తం • ల్లీ! ప్రోవవే శాంకరీ!

[అని సావిత్రి నిష్క్రమించును.]

[పర్వతప్రాంతమున యముఁడు ప్రవేశించి వెనుకకుఁ దిరిగిచూచి]

యము—ఆహా! ఏమి యీ సాహసము?

సీ॥ ముండ్లు తే ళ్ళగపడ్డఁ • బోవదు వెన్కకుఁ
బాముపడగ నైనఁ • బాదమిడును
మత్తేభములకైన • మలగ దొక్కింతయు
నఱచు సింగమునైన • దరియుచుండుఁ
బల్లంబు మిట్టను • భావ మింతయు లేదు
పర్వతంబుల నైనఁ • బ్రాఁకివచ్చుఁ
బావులఁ జెరువులఁ • బగికింప దొక్కింత
విపులాపగలనైన • వెడలుచుండు

ఘర్మ మొలయంగ ధైర్యంబు • గడలుకొనఁగ
బైట పొర్లాడ భువిఁ, గేశ•బంధ మూడ
వచ్చు నతి; కార్యసిద్ధికై • పాటుపడెడు
వారు వెఱతురె మృత్యువు • పై నిఁబడిన?

కానిమ్ము. సామాన్యారణ్యముల నిర్గమించుట కాదు. చిఱుత పర్వతంబుల నధిగమించుట గాదు. శిఖరాగ్రముల నాకసముఁ జుంబించు నీనగం బారోహించి రాఁజాలదు. ఈమహారణ్యములు, ఈ నదులు తోవ నీయవు. నేను సఫలమనోరథు డను గాకపోను. నారదోక్తులు వ్యర్థములు కాకపోవు. ఈమె దృష్టిపథమునఁ బడకుండ నావలప్రక్క కేగెద. [అని పర్వతము నధిరోహించును.]

సావి—నాథా! నాథా! [అనుచు యథోక్తముగాఁ బ్రవేశించి దిక్కులు పరికించి నిర్విణ్ణయై నిట్టూర్పు విడిచి] ఇప్పు డెచ్చటికిఁ బ్రవేశించితిని? పతిప్రాణము లెక్కడ? దండధరుం డేఁడీ? హా! హా! నాస్థితి విషమముగఁ బరిణమించెనే వైవస్వతుం డదృశ్యుం డయ్యెనా? ప్రకృతి నన్ను మోసగించుచుండెనా? నాభక్తి కలుషిత మయ్యెనా? నా మనోనిశ్చయము తగ్గెనా? నాదృష్టి నా పతిప్రాణములపై నుండ, పాశపాణి లోచన గోచరుండై యుండ, నింతలో నీ విభ్రమ మేల? ఈ దిక్కునం బోవుద మన్నఁ జండకిరణకిరణాతిత ప్తంబులై, మహీధ్రంబుల ననుకరించు సైకతరాశిచయంబులు, ఆవలప్రక్క నేగుద మన్న దుష్టభూతనివహంబుల కాలవాలమై, పిశాచీభీకరారవాతిభీషణం బై, గాఢాంధకారబంధురం బై భూమ్యాకాశంబుల వ్యాపించి భయకంపములఁ గల్పించు దుస్తరమహారణ్యంబులు! ఆ ప్రక్కఁ గనుంగొన్న మహోత్తరతరంగసంఘాత సముదీర్ణ గిరికందరం బై, పర్వతతుల్యానేక కమఠపాఠీన పరీవృతం బై, వనగజంబులసైతము గిరగిరం ద్రిప్పఁజాలు బహువిధావర్తసంకులంబులై అతివేగమునఁ బ్రవహించు వాహినీ సమూహంబులు. ఈ దిక్కునంజూడఁ గన్నుల మిఱుమిట్లు

గొల్పుచు ఘోరగిరినదీపరిఘలఁ బరిఢవిల్లి, దుర్గమాటవీసైన్య సహస్రంబుల నావరించి, గైరికధాతుచిత్రానంతశిఖరంబుల విరాజిల్లి, క్రూరసత్వభటపటలదుస్తరంబై, గుహాతిగూఢ మార్గసముపేతంబై, కేకీమాగధమానితంబై, మహారాజదుర్గ మనఁదగి, యీ నగరాజంబు మార్గమీయక దుర్గమమై కిన్పట్టు చుండునే. యముం డేమార్గమునఁ బోయెనో తెలియఁజాలను. ఇంక నాకు శరణ మెయ్యది? నా పతిప్రాణములతో నెట్లనుగ మింతును? యమధర్మరాజు నెట్లు కాంతును? ఓ యరణ్యమా! నాకు మార్గ మిమ్ము; ఓనదీమతల్లులారా! నాకుఁ దోవఁ జూ ప్రుఁడు; ఓసైకతసముదయములారా! నాకుఁ దెరు వొసంగుడు. ఓ నగేంద్రమా! నాకు దారి నీయుము. [దారిఁ గానక నిర్వే దముతో] అయ్యో! ఎవరు నా మొఱాలింపరే! అందఱకుఁ గొఱమాలినదాన నైతినే! త్రిలోకజననీ! సావిత్రీ! నీభక్తురా లనుభవించెడి యాపద నీక్షింపకుంటివా? నా దీనోక్తు లా లంప కుంటివా? నా మనోధైర్యమును బరిశీలించుచుంటివా? ఇంక నేఁ గాలహరణమున కోర్వఁజాలను. భర్తృప్రాణములఁ బాయనేరను. స్థూలశరీరమునఁ బోనేరకున్నను, శిలాతలమున నా తల వ్రక్కలుచేసికొని సూక్ష్మశరీరముననే పతిజీవముల ననుగమించెద. యమధర్మరాజా! పరుగిడకుము. నాథా! నాథా! వచ్చుచున్నాను, వచ్చుచున్నాను. [అని శిరమును బర్వతమునకుఁ గొట్టుకొనఁబోవును.]

యమ—ఆ! ఆ! వలదు, వలదు. సాహసము వలదు. [అని వారిం చుచు] సావిత్రీ! ఏమి నీధైర్యము? ఎంత సాహసమునకుఁ బాల్పడుచుంటివి? ఈ ప్రదేశములు మానవుల కగమ్యము లని చెప్పలేదా? రాజపుత్రీ! ఆ నదిని జూడుము! [అంత వైతరణి కానిపించును.] దానినిఁ దలఁచిన నెంతవారికిని భయకంపములు కలుగుచుండును. ఆ నది వైతరణీగోదానముఁ జేసిన మానవు లకు సులభముగ దాఁటనగును. అట్లు చేయనిపాపులు దరిఁ

జేరనేరక యందుఁ గుందుచుందురు. దాని విశేష మొక్కింత చెప్పెద నాకర్ణింపుము.

మ॥ చీమును నెత్తురుం గలిసి • చిక్కఁగఁ బాఱుచు, నెల్లకాలము
ద్దామజలగ్రహంబులకుఁ • దావలమై, బహూర్మిఘట్టనో
ద్భ్రామితదుష్టవర్గ మయి, • వర్తిలు వైతరణీప్రవాహముల్
గోమలి! దాఁటు టెట్లు? కను•గొంటకు శక్యమె మానవాళికిన్?

ఈ ప్రదేశములు మానవుల కగమ్యంబులై భయాస్పదంబులుగ నుండును. ఇఁక శీఘ్రముగ వెనుకకుఁ బొమ్ము.

సావి—దేవా! అన్నిసమయములయందును భర్తను విడనాడక సేవించుటయే పతివ్రతాధర్మమని పెద్దలు చెప్ప వినియుండియు, నే నెట్లు ధర్మవిరుద్ధముగఁ బ్రవర్తింతును?

మ॥ ధనమార్జించి యభీష్టవస్తువుల మోదప్రాప్తి సంధించుచున్
ఘనుఁడంచున్ జను లెల్లఁబల్కఁతటి నా•నాథుండు నానాథుఁడం
చని యెందేగిన నందుఁబోయి పతితో • నానందమున్ బొంది కా
లనిబద్ధం బగు కష్టమున్ద విడువన్ • శ్లాఘింతురే యెవ్వరున్?

ఈ ప్రదేశము లెంతక్రూరములై, భయంకరములై, దుర్గమములైనను నా కాయాన మావంతయుఁ గలుగనేరదు.

గీ॥ ప్రాణపతితోడ సౌఖ్యముల్ • పడఁదలంచు
కాంత గణియించునే యెట్టి • కష్టమేని?
నవఘనప్రవదంబుపా•నంబుఁ గోరు
చాతకమునకుఁ బిడుగుల•జడుపు లున్నె!

పుత్త్రసంతానము లేక పరితపించుచు మదేకజీవితులై మావృత్తాంతము తెలియక యసువులఁగూడ విడనాడుదురేమో యని సంశయింపఁ దగిన నాతలిదండ్రుల కొఱకైన విచారింపను. భర్తకుఁగాని యీశరీరపతనమునకైన లెక్కింపను. అట్టి నా

కీ వైతరిణి కాని, యమలోకమార్గములు కాని భయమును గలిగింపనేరవు.

యము—కుమారీ! ధర్మనిబద్ధములైన నీ వాక్యములకు మిక్కిలి సంతసించితిని. కష్టసమయమందుఁగూడ ధర్మహానికి వెఱవని శ్లాఘ్య చరిత్ర వగుటంజేసి నీ సౌశీల్యమునకే నెంతయు మెచ్చి నీ తలిదండ్రులకు నూర్గురు కొడుకులు కలుగునట్లు వరం బిచ్చితిని. వీనినిఁ గైకొని సంతసింపుము. ఇంక నాలసింపక మఱలి పొమ్ము. [అని యముఁడు నిష్క్రమించును.]

సావి—ఈ వైవస్వతుని యనుగ్రహవిశేషమున నా జననీజనకులకుఁ గూడ మహోపకారము కలిగినది. ఇంక నా భర్త నిచ్చు వఱకు యము ననుసరించెద తల్లీ! సావిత్రీ! ఈ మహానదినిఁ దరింపఁజేయుభారమంతయు నీదే.

గీ॥ పరిఘల నొనర్చి వార్ధులఁ • బర్వతములఁ
గోటలం జేసి జేజేలు • గొలువ సకల
లోకముల నేలు నీదువి•లోకనములు
పఱగ నెందేని, నంబ! దు• స్తరము కలదె?

[సావిత్రి నిష్క్రమించును.]

ఇది పంచమాంకము.

---



# సావిత్రీ నాటకము.

## షష్ఠాంకము.

[యమలోక ప్రాంతము.]

[తెరలో] ఇప్పుడు నన్ను వదలుము. నా తమ్ముడి పెండ్లి చూచి వస్తా.

[యమభటుఁడు లాగుచుండ బాధితయై పై వాక్యములఁ బల్కుచు మల్లిక ప్రవేశించును.]

భటు—తమ్ముని పెండ్లి కేగెద ననును గాని, యిప్పటికైన భర్త సేవ కేగెద ననదే!

మల్లి—నాయనా! యింటిముందుకు బండి వచ్చినది. ఎదురు చూస్తున్నది. ఒక్క మాటు మా చెల్లిని, అక్కాయిని, అమ్మను, నాన్నను చూచివస్తా. నన్ను వదలుము.

భటు—అమ్మా, నాయనా యఁట! అక్క, చెల్లె లఁట! గొంతు మీఁదఁ గత్తిపెట్టినను అత్త, మామ అనదు.

మల్లి—బాబూ! యీ పెండ్లికి మా నాయన వరహాలపేరు చేయించి నాఁడు. అడిగి పెట్టుకొని వచ్చెద. నిన్ననే కొత్త పట్టుచీరె వచ్చింది. అది కట్టుకొని అట్టె పూళ్ళో నాలుగు వీథులూ పేరంటంచేసి వస్తా. నన్ను వదలుము. నా మాట వినుము.

భటు—మళ్ళా కొత్త నగలు, కొత్త బట్టలు తప్ప, తనకై సన్యసించిన భర్తను జూచెద ననదే! ఈ నీచురాలు యెన్నియేండ్లు నరకమునఁ బడి యుండవలయునో?

మల్లి—కంసలబత్తుడి దగ్గర చంద్రవంక, చామంతిపువ్వు. గాజులు యిప్పుడే తయారైనవి. మెఱుగుకూడా పెట్టాడు. అవి తీసికొనివస్తా.

భటు—అక్కడ తప్పినా యిక్కడ తప్పవు. చేతులకే గాదు, కాళ్ళకుఁ గూడ వేయించెద రా. [అని లాగును.]

మల్లి—ఎక్కడికి?

భటు—ఎక్కడికా, యమలోకానికి!

మల్లి—యమలోకానికే? అమ్మయ్యో! నేను రాలేను. నేను రాలేను. మా వాళ్ళను చూడనిది ఒక్క క్షణమైన వుండలేను. మొగుణ్ణి కూడా వదలి మా వాళ్ళదగ్గరనే వున్నా. నేను రాను. నేను రాను. [అని మళ్ళఁబడును.]

భటు—రాకున్న గుంజుకొనిపోయెద. రా, రమ్ము. [అని లాగును.]

మల్లి—అయ్యో! అయ్యో! అమ్మా! అమ్మా! నాయనా! నాయనా! వీఁడు నన్ను గుంజుతున్నాఁడు. రాండరా. [అని పిలిచి] అయ్యో! యెవరు రారే? [మఱలఁ బిలిచి] మీ గొంతులు కొయ్య! రండరా. వీఁడు నన్ను చంపుతున్నాఁడు.

భటు—ఇది నీ యిల్లు కాదు. ప్రేతభూమి. పాపులు పాపఫల మనుభవించెడు చోటు.

మల్లి—అయితే నే నిక్కడి కెందుకు వచ్చా?

భటు—చచ్చినావు గనుక.

మల్లి—అయ్యో! నేను చచ్చితినా? ఇంక మావాళ్ళను చూడనా? నా నగలు పెట్టుకోనా? నా చీరెలు కట్టుకోనా? అయ్యో! అయ్యో! [అని దుఃఖించును.]

భటు—ఏడ్చిన లాభము లేదు. రా, రమ్ము.

మల్లి—ఏమైనా సరే. నేను రాను; నేను రాను. [అని పెనుఁగు లాడుచుఁ గూలఁబడును.]

భటు—రావుగా? ఎట్లు రావో చూచెద. [అని లాగి ఒకదెబ్బ వేయును.]

మల్లి—[లేచి] దుర్భరము! దుర్భరము! అయ్యా? నన్ను రక్షింపుము. ఈ బాధ భరింపనేరను. ఇంక రాఁజాలను. నన్ను దయఁగనుము. [చేతులు జోడించి వేఁడుకొనును.]

భటు—ఓ దుష్టురాలా! నీవెంత వేఁడుకొన్నను లాభము కలుగనేరదు. నీవు యమలోకమునకు రాక తప్పదు. రా, రమ్ము. [అని లాగును.]

మల్లి—తప్పదా?

భటు—రావడమే కాదు. పలువిధములైన శిక్షలనుగూడ అనుభవింపవలయు.

మల్లి—నేనేనా?

భటు—దుర్మదాతిరేకంబున ఒడలు తెలియక ఘోరపాపంబు లాచరించుట నీవును, నీపాపఫల మనుభవించుట మఱియొకరునా?

మల్లి—నాయనా! సామాన్యముగా స్త్రీలంతా జేయు కృత్యములే చేశాగాని, ఎక్కువేం చేశా?

భటు—దుష్టులకు లోకమెల్ల దుష్టముగఁ గనిపించుట సహజమే. తాము జేసిన నీచకార్యములనుగూడ మంచికార్యము లని దుష్టబుద్ధులు సంతసించుచుందురు. నీ యంతరాత్మ నిన్ను బాధించుటలేదా? పాషాణసదృశవు; నీకు అంతరాత్మ ఎక్కడిది? నిరంతర భర్తృ తిరస్కారిణివి నీవు కావూ? పతి వంచనాపరతంత్రివు నీవు కావూ? పరశ్రేయో ఉపహానశీలవు నీవు కావూ? అన్యవంచనాసక్తవు నీవు కావూ? నిత్యకలహకారిణివి నీవు కావూ? పతిశరీరతాడనోద్యోగ పరతంత్రివు నీవు కావూ? బంధుద్వేషిణివి నీవు కావూ? ఎన్నని లెక్కింపఁ గలము? ఎన్నని చెప్పఁగలము?

మల్లి—ఇవికూడా పాపాలే!

భటు—పాపాలో, పుణ్యాలో ఇప్పుడుగాదు తెలియుట? తేళ్ళగోత మున నిన్ను బడవేయునపుడు; కాలెడు ఉక్కు స్తంభమునకు నిన్ను గట్టునపుడు; వాడికత్తుల నీ నాల్కను చీల్చునప్పుడు; క్రూర సర్పంబుల నిన్నుఁ గఱపించునపుడు; సలసలకాఁగుతైల భాండముల నిన్ను ముంచుచుఁ దేల్చుచున్నపుడు; పందునిప్పుల నిన్నుఁ బొర్లించునపుడు నీకుఁ దెలియఁగలదు.

మల్లి—హా! హా! దుర్భరము, దుర్భరము. అయ్యయ్యో! గర్వాతి రేకంబునఁ గన్నుగానక సంచరించుటచేతనేకదా, యీకష్టము లనుభవింపవలయును? చేతులాఱఁజేసిన పాప మూఱక పోవునా? దోషములను జేయునప్పుడు సర్వసాక్షి యీశ్వరుఁడు గలఁడనికాని, నా కృత్యములు చూచుచుండు ననికాని, నా పాపముల కిట్టిబాధ కలుగునని కాని ఎన్నడును దలఁపకపోతినే. పతిని దైవముగా భజించువారిని జూచి తిరస్కరించితినిగాని, వారి కీబాధలు గలుగ ననుమాటలు నమ్మనైతినే; పాపములు చేసినవారిని యమభటులు బాధింతురని పెద్దలు చెప్పఁ బరిహ సించితిఁగాని, విశ్వసింపనైతినే. నావలె భర్తలను దిరస్క రించు దుష్టకాంతల కీ యమలోకబాధ లిట్టివని చెప్పి వారిం చుటకైన నా కవకాశము లేకుండెనే!

భటు—ఏమి యోజించెదవు. ఇపుడా పశ్చాత్తాపము?

మల్లి—నాయనా! ఇఁకముం దాదోషములు చేయను. అందఱికి తల నొగ్గెదను. అందఱిని తోడబుట్టువులకంటె నెక్కుడుగ నాద రించెద. దైవములఁబోలె నారాధించెద.

భటు—ఇపుడా అందఱి నాదరించుట? దైవముగఁ జూడఁదగిన నీ భర్తను బహుహింసలుపెట్టిన పాపాత్మురాలవే. నీ పాప మున కంతమున్నదా? ఛీ! నీచురాల. [కొట్టఁబోవును.]

మల్లి—అయ్యో! నన్ను హింసింపకుము. ఈవఱ కొనరించిన తప్పు లిఁక ముం దెన్నఁడును జేయను. నా భర్తకు దాసురాలనై

పరివర్తించెద. ఆయన యాజ్ఞల శిరసా వహించెద. ఆయన కనుసన్నలఁ బరివర్తించెద త్రికాలములయందు నాభర్త పాదములనే సేవించెద. తుచ్ఛములగు వస్త్రభూషణాదులకై నా భర్తను బాధించను. నాపట్టు సాగవలె నని నిర్బంధించను. నా పతి సంపాదించి తెచ్చినదానిని చాలదని తిట్టను. నాభర్త వలని యుపచారము నపేక్షించను. పంక్తిభేదము గావింపను. నాకు నీతి చెప్పువారిని తిరస్కరింపను. అత్తమామల దూషింపను. భర్తనే ఈశ్వరునిగాఁ దలంచెద. ఆతనితో సహగమన మొనరించెద. నా యపరాధములను మన్నింపుము. నన్ను బంధవిముక్తురాలను గావింపుము.

భటు—ఇంతటితో వదలుటకు వీలులేదు. యమలోకమునకు రావలసినదే. నీపాపఫల మనుభవింపవలసినదే! రా.రమ్మా. [అని లాగికొనిపోవును.]

మల్లి—[ముందుఁజూచి భయము నభినయించుచు] ఏమి యీతేళ్ళు! అయ్యో! ఆ పాములు నన్ను కఱచునే! ఆ పులులు నన్ను మ్రింగునే! ఆ ఏనుగులు నన్ను త్రొక్కునే! హా! దుస్సహము! దుస్సహము! ఈ వడగాలి కాఁగనేరను ఈ ప్రదేశములు చూడనేరను. బాధ, బాధ! భరింపఁజాల! భరింపఁజాల [భయముచేఁ గంపించుచు నిష్క్రమించును.]

ఇది నిష్కంభము.

---

యము—[ప్రవేశించి తిరిగి చూచి, ఆశ్చర్య మభినయించుచు] ఏమి యీ యద్భుతము!

సీ॥ శాతదంష్ట్రాభీల•శార్దూలసింహాది
మృగము లఱ్ఱులు వంచి • యేగుచుండె
మకరమీనావర్త•నికరదుస్తరములై
వడిఁ బాఱునదులు కాం•ల్నడక లాయె

విషవహ్నికీలికా • విస్తృతరసనులౌ
ఫణులు ఫణల వంచి • పాఱుచుండె
క్రోధఘూర్ణితమృత్యు • కుటిలజూటము లైన
వెదురుపొదల్ దారి • విడుచుచుండె
అధికనిమ్నోన్నతం బగు • నట్టి ధాత్రి
సమతలంబయి యతిమృదు • త్వమునఁ బఱఁగె
నదియు నిది యేమి ప్రకృతి య • మ్మదితఁ గొల్చు;
నౌర ! యీ సాధ్వి నెన్న నా • కలవి యగునె ?

చతుర్దశభువనములు నా యధీనములు. చరాచరభూత జాలం బంతయు మత్కృపాపరిరక్షితము. ఎందఱ ప్రాణవాయువులో నా స్వాధీనము లయినవి. అవిచ్ఛిన్నాయాతభూతనివహంబున నెందును, ఏ సమయమందున నిట్టి భర్తృజీవ స్వీకరణాభిలాషను నేను గని విని యెఱుంగను. నారదఋషీంద్రుఁడే యీమెప్రభావమును వెల్లడించెను కాని విశ్వసించనైతి. చూడఁజూడ నీమె నాలోకమునకు వచ్చుననియే తోఁచుచున్నది. మునివాక్యములే నిశ్చయము లగు నాయనిశంక వొడము చున్నది. [శరీరము కంపింప, దృష్టి నిగిడ్చి] సమస్త జీవరాశిని శాసింప సమర్థుండగు నీ యముండు, స్మరణమాత్రాశేషజీవభయంకర కాలదండమండితదోర్దండుం డగు నీయముండు, అవలోకనమాత్రవిహ్వలీకృతాఖిలలోకవారుం డగు నీ యముండు సర్వకార్య నిర్వహణచణుండు కాకుండునా ? ఈమె పతివ్రతాశిరోమణియగుఁ గాక! యమలోకమున నడుగిడ సమర్థురా లగుఁగాక ! పతిప్రాణముల నెట్లు గ్రహించునో చూచెద.

సావి—నాథా ! నాథా ! పలుక వేమి ? [అని దైన్యముతోఁ బ్రవేశించును.] అయ్యో ! ఎంతలో నెంతటి యదృష్టహీనురాల నైతిని.

ఉ॥ స్వేదకణంబులం జిదిమి, • చిక్కెడలించుచుఁ గుంతలంబులన్,
బాదములొత్తువారెఁ; దె • అవా!ముఖపద్మమువాడె; నయ్యొ!యం

చాదటఁ బల్కి, యువ్విపిన•మంతయుఁ జూపిన నీ వదేల న
న్నాదుకొనంగ రావు? కన; • వార్తినిఁ బాపవు ప్రాణవల్లభా!

హృదయేశ్వరా! నీ ముఖారవింద మవలోకింపక యిం
కెంతకాల ముండఁగలను? నీ పాదముల నర్చింపక యెట్లు
జీవింపఁగలుగుదును?

యమ—రాజపుత్త్రి! ఇంత సాహసము తగునా? చెప్పినకొలఁది
వచ్చుచుంటివే. ఇది యేమి వెఱ్ఱి? ఈ లోకంబునం గల పాపు
లనుభవించెడి బాధలం దలంచిన హృదయవిదారణం బొన
రింపక మానదు. అట్టియెడఁ జూచుట కష్టమని వేఱుగఁ జెప్ప
వలయునా? అదిగో! నీతిబాహ్యులై, దుష్కృత్యమునకు
లోనైనపాపుల నెల్లర నాభటు లెట్లు హింసించుచున్నారో
చూడుము. [యమలోకహింసలు ప్రత్యక్షమగును.]

సీ॥ కట్టి పెన్మంటలఁ • గాల్చి నేడ్చెదువారె
పరునింటఁ జిచ్చిడు•పాపమతులు
గుదియల శిరముపైఁ • గొట్టఁ గుందెడువారె
కడఁగి కన్నెల నమ్ము•కలుషయుతులు
మఱగఁగాఁచిన•నూనె దొరలింపఁగా నోటఁ
దల్లడిల్లెడువాఁడె • త్రాగుబోతు
అంపమున గళంబు • త్రెంప నార్చెడువాఁడె
గొఱియల మేకలఁ • గోయుఖలుఁడు
కరము పక్షులు పొడువంగ • నఱచువాఁడె
బలిమిఁ బట్టలఁ గొట్టెడు•పామరుండు
మంట శిర మిడి వేల్వంగ • మ్రందువాఁడె
కపటభక్తినిఁ బ్రకటించు•కలుషుఁ డబల!

మఱియు,

సీ॥ శూలాలఁ బొడువంగ • శోకించునాతండె
తలిదండ్రులకు బాధ•సలుపువాఁడు
గానుగ శిర మిడి • కడిఁదిఁ ద్రిప్పఁగ విల
పించునాతఁడె దొంగి•లించువాఁడు

చిఱుతకత్తుల నాల్కఁ • జీల్ప సుఱ్ఱెక్కెడువాఁడె
కూటసాక్ష్యము వల్కు • కుత్సితుండు
బలిమి బండ్లకుఁ గట్టి • పరుగిడఁ గొట్టు దుః
ఖించునాతఁడె మిత్ర • వంచకుండు
తప్తతైలంబులను ముంచఁ • దల్లడిల్లు
వాఁడె ప్రభువుల వంచించు • బాలిశుండు
బంధురఖరాసివని బాధ • పడెడువాఁడె
బ్రహ్మహత్య నొనర్చెడు • పతితుఁ డతివ!

మఱియు, నన్నవిక్రయాదుల నొనరించు నీచులను, డంబముగ సంచరించు ద్రోహులను, ఇంక ననేకవిధంబు లగు పాతకంబు లొనరించు దుష్టుల నెల్లర నా కింకరులు భయంకరాకారులై, ముసలంబుల మోదుచుఁ, గూపంబులఁ ద్రోయుచు, మహిషంబులం బొడిపించుచు, నేనుఁగులఁ ద్రొక్కించుచుఁ బలువిధంబుల హింసించుచుందురు. పాఱెడు రక్తంపుటేర్లును, మూఁగిన గండుచీమలును, మొఱనెట్టు పాపులును, దిరిగెడు భూతనివహంబులును గలిగి దుర్వాసనావాసితంబులై ఈ ప్రదేశంబులు భయంబున కాస్పదం బన నొప్పియుండును. అట్టి నాపట్టణంబు మానవదేహంబునఁ జొఱ నశక్యంబుగా నుండును. కడుదూరము నడచితివి. ఇఁక వెళ్ళుము.

సావి—దేవా! ఘోరారణ్యంబుల నడుచుచున్నను దుస్సహములై భీతిజనకంబులైన ప్రదేశంబులఁ జూచుచున్నను నా కాయాస మావంతయుఁ గలుగనేరదు. ప్రాణపదంబైన నాప్రియ భర్తను విడనాడనేరను. దేవా! నా హృదయవల్లభుని విడనాడి ప్రాణములతో నున్న నేమి, లేకున్న నేమి? హృదయేశ్వర చరణకమలాసక్తనై, దేహమందుఁగూడ ఆస వదలి అగ్గినుఱుకుటకు సయితము సంసిద్ధనై యున్న నా కీయమలోకమార్గంబులును, భయాస్పదంబులగు నీ భటులయాకారంబులును భయ జనకంబు లగునా?

గీ॥ భర్తృపాదాబ్జమకరంద పానలోల
నైన నే వీని( గని భయ మొంద(గలనె?
సతము మదధార( దేలెడు షట్పదాళి
భీతినొందునె కరికర్ణ ఘాతములకు?

కాన నో యమధర్మరాజా! ఇంకెంతటి యాపదలు వచ్చి నను నాపిరియభర్తను విడనాడనేరను.

యమ—రాజపుత్త్రి! విధివిధాన మనుల్లంఘనీయ మని నీ వెఱుగవా?

ఉ॥ బాల! భవత్ప్రియుండు గుణ భాసితు(డైన మఱెట్టి(డైననున్
గాలముతీరిపోయె నిఁక( గ్రిమ్మరి ప్రాణముగల్గి వచ్చునే?
యేల వృథాప్రయాన మిది? యాపగిదిన్ బడు కానిపోని క
ష్టాలకు లాభము ల్గలవె? సారసమిత్రు(డు రాత్రి వచ్చునే?

జన్మాంతర కర్మానుసారమైన కష్టసుఖము లనుభవింపవల యునే కాని నీ వేమిచేయగలవు? నీ పురాకృతమును నిందించు కొనుచు( ద్వరలో మఱలిపొమ్ము.

సావి—దేవా! సర్వజ్ఞులగు తా మిట్లు పలుక సాహసింతురా? మానవులకు( బ్రియత్నములు లేక కార్యములు సమగ్రఫలము లొనంగునా? బుద్ధిమంతు లయినవారు శుభాశుభము లయిన జన్మాంతరకర్మ వాసనల యోజించి, యశుభవాసనయేయుండె, దుష్కార్యాసక్తిని గలుగ(జేసిన( దెలివి( దెచ్చుకొని యప మార్గగామి యగు హృదయాశ్వమును సరియగుత్రోవ నడి పించి, సత్కర్మముల నాచరించి పరమేశ్వరానుగ్రహమునకు( బాత్రులై యిహమందు( జిరసౌఖ్య మనుభవించి యనంతర మందుత్తలోకంబున కేగవలయుననియు, ఇట్టిదానినే పురుష కారమనియు, నిట్టి పురుషకారముచేతనే మానవులు సర్వ పాపవిముక్తులై ప్రియత్నము ననుసరించి స్వర్గాధిపత్యాదు లను గూడ( బొందుదురనియు( బెద్దలు చెప్పుదురు. తాము చెప్పినట్లు పురుషకారము ననుసరింపక కర్మను నిందించుచు, నూరకున్నయెడల మనుష్యులు సైతము పశుపక్ష్యాదులతో సమాను లనుటకు సంశయ మే ముండును? కాన నో యమ

ధర్మరాజా ! నానాథుండు సత్కర్మాచరణపరాయణుండు, సత్య సంధుండు. అట్టి మహానీయునకు జన్మాంతరకర్మానుసారము మరణము నిశ్చయమైనను నాపతివ్రియభర్త సత్ప్రవర్తనమును సౌశీల్యాదులును నేనాతనికై యొనరించెడి పరదేవతార్చన మొదలగు సత్కర్మలును నాభర్తను బ్రతికింప సమర్థములు కాకపోవునా? శ్రుతిస్మృతుల నమ్మి త్రికరణశుద్ధిగఁ దాము చేయఁదగిన సత్కర్మలఁ జేసెడువారికిఁ బాపములు నశించి యుత్కృష్టఫలములు రాకపోయిన శ్రుతిస్మృతు లసత్యము లనియు, యజ్ఞాదు లనర్థదాయకము లనియుఁ జెప్పక తప్పదు.

ఇంత యేల? నేను యథార్థమైన పతివ్రతను. నాభర్త నిజముగ నుత్తములలో నుత్తముఁడు. అట్టి నాభర్తయే నాకు లభింపకున్న దేవుఁడు లేకపోవలె, ధర్మమడుగంటవలె, సూర్యచంద్రులు తేజోహీనులు కావలె; స్వర్గాదిలోకములు మాఱవలె. వెయ్యేల? నీవును, నీ లోకమును నీ కింకరులు సైతము లేకపోవలసియేవచ్చు. దేవా! ఇంకఁ గాఠిన్యమును వహింపకుము. కాలహరణం బొనరింపకుము. నాయభీష్టం బొనఁగూర్పుము.

యము — [ఆశ్చర్యముతో] [స్వ] ఆహా! ఏమి యీమె మనశ్శుద్ధి. యెంతయుఁ బ్రశంసనీయముగ నున్నదికదా! కాని యీమె నొక్కింత పరీక్షించి చూచెద. [ప్రకా] రాజపుత్త్రి! నీచెప్పిన వాక్యము లన్నియు యథార్థములే! పురుషకార మవలంబించువా రుత్కృష్టఫలములనే పొందవలయును. కనుకనే సామాన్య మానవజీవాపహారణనియుక్తు లగు నాభటుల నంపక నేనై నీపతికడకు వచ్చితి. నిన్నింతదూరము రానిచ్చితి. నీవు కోరకయే యనేకవరము లిచ్చితి. దుర్లభమైన ప్రాణదానము నెవ్వరికైన నెపుడైన నే నిచ్చినట్లు కనియుంటివా? తుదకు వినియైన నుంటివా? నీవు చెప్పినట్లు పురుషకారపరతంత్రులు శాస్త్రోక్తఫలంబులఁ బొందకుండినఁ బొందకుందురుగాక! యమనియమాదులు నిరర్థకము లగుఁగాక! సూర్యాదిగ్రహములే మాఱుఁగాక! నేను, నాలోకము, నాభటులు వ్యత్యాసమును బొందు

దుముగాక ! నీపతి ప్రాణములమాత్రి మియ్యను. ఇం కేవర మైన నిరభ్యంతరముగ నీకొసంగెద. నానిశ్చయ మాకర్ణింపుము.

సీ॥ వివిధరత్నప్రభా•విభ్రాజితాత్యంత
రమణీయభూషణ•రాజినైన
కల్పితానల్పసం•కల్పలోకారాధ్య
సురసేవ్యకల్పక•తరులనైన
ఇంద్రముఖ్యామర•స్పృహణీయ కమనీయ
గణనీయ దివ్యభో•గముల నైన
దుర్హిణప్రదత్తాన్య•దుర్లభాస్మాకీన
యమలోకపరిపాల•నమును నైన
విశ్వవిశ్వాతిశయవస్తు•వితతియందుఁ
దడయ కిచ్చెదఁ గోరు మెు•ద్దానినైనఁ;
గాని నియమితమృత్యుసం•గతుని నీదు
విభుని యసువుల నింక నే • విడువ, విడువ.

సావి—[యోచించి శిరఃకంపముచేసి] [ప్ర] యమధర్మరాజా! నిజముగ వరమొ లొసంగెదవా?

యము—నిస్సందేహముగ. సావిత్రి! వేయేల? పతిప్రాణంబులు దక్క వర మేమి, వరశతము నొసంగెద.

సావి—దేవా! అటులైన నాకుఁగులోద్వహుండగు పుత్త్రి నొసంగుము.

యము— [స్వ] ఏమి యీమె బుద్ధివిశేషము? ఎంతయుఁ గొని యాడఁ దగినది కదా! కానిమ్ము. మఱికొంత పరీక్షించెద. [ప్ర] సావిత్రి! పుత్త్రుఁడా? పుత్త్రశతంబు నొసంగితి. నింకఁ బొమ్ము [అని పోఁబోవును.]

సావి—యమధర్మరాజా, యమధర్మరాజా!

యము—[వెనుకకుఁ దిరిగి చూచి] సావిత్రి, ఇం కేటి కిం దుంటివి?

సావి—వరసాఫల్యమునకు.

యము—నే ననుట యొకటి, యగుట యొకటియునా?

సావి—తా మనిన దగుటకే.

యము—ఏల కాదు?

సావి—భర్త నొసంగితిఁ గదా, యముఁడ!

యము—భర్త నీయ వలనుపడదనిన, నింకను భర్త భర్త యనెదవేల?

సావి—యమధర్మరాజా, ధర్మోద్ధరణభారధూర్వహుఁడవు సత్యపథానువర్తివి న్యాయమార్గప్రవర్తకుఁడవు. యోజించుకొనుము.

యము—యోజించితిని. పతిప్రాణముల నీయ వలనుపడ దని నిశ్చయించితిని.

సావి—ఔనా? ఆలోచించితివా, నిశ్చయించితివా? నన్నుఁ బతివ్రతాశిరోమణి వని యంగీకరించితివి. సౌశీల్యవతీమతల్లి వని యుగ్గడించితివి. పుత్త్రశతవరంబు నొసంగితివి. నాపతి నా కీయకున్న బుత్త్రప్రాప్తి యెట్లగుననుకొంటివి?

యము—[స్వ] ఏమి యీయామె మనోదార్ఢ్యము, ప్రశంసనీయముగ నున్నదే కానిమ్ము.

సావి—వైవస్వతా? ఏమి నా మొఱాలింపవు? ఏల దయాదృష్టుల వీక్షింపవు? ఇం కేటికి నాపతిప్రాణము లర్పింపవు? ఎందుకు నా హృదయతాప మపనయింపవు?

యము—[స్వ] ఇంకఁ దడయరాదు. ఈమె మనోభీష్టము నెఱవేర్చుటయే యుత్తమ మని తోఁచుచున్నది.

సావి—[కోపముతో] ప్రేతనాథా, ఏల మాటాడవు? ఎందులకు నిరుత్తరుఁడ వయ్యెదవు? ఈ నిరుత్తర మనంగీకారసూచకమా? ధర్మభంగమా? సత్యహానియా? స్వవచనవిఘాతమా? [క్రోధ కరుణములతో] ఆహా, నే నింకఁ బతివియోగానల సంతప్తను గావలసినదేనా? నిరాశఁ జెందవలసినదేనా? [అని తీవ్రముగాఁ జూచుచుండును.]

యము—[భయముతో] ఈ సాధ్వీమణి భర్తృవియోగాకులచిత్త యయి, క్రోధఘూర్ణితనేత్ర యయి, దుర్వారకోపానిలాలోలశరీర యయి, దుర్నిరీక్ష్య యయి కన్పట్టుచున్నదే. ఇం కేమి పలుకునో కదా!

[సావిత్రీదేవి ప్రత్యక్ష మగును.]

సావి — ఎక్కడిదీ దివ్యతేజము? నాతల్లి సావిత్రీదేవియా! ధన్యాఽస్మి. ధన్యాఽస్మి. [అని కనులుమూయును.]

సావిత్రీదేవి — ఓయీ, యమధర్మరాజా! సంశయింపకుము. స్వధర్మ నిర్వహణపరాయణులు స్త్రీలు కాదు, శూద్రులు కాదు, చండాలురు సైతము ఇష్టకార్యఫలోపేతులై భవబంధన వినిర్ముక్తులై యిహపరసాధకులు కాఁగలరు. అనవరతపతిసేవాతత్పర యగు నీసావిత్రిని, పతిప్రాణస్వీకరణబద్ధకంకణ యగు నీ సావిత్రిని, దుస్తరానేకఘోర ప్రదేశప్రవిష్టయగు నీసావిత్రిని, మత్పాదకమలధ్యాననిరతయగు నీ సావిత్రిని సంతుష్టిఁ బఱపుము.

యము — దేవీ! భవద్దర్శనంబున ధన్యుండనైతిని. ఆజ్ఞాకుసుమంబుల శిరంబున ధరించుచున్నాఁడ.

[సావిత్రీదేవి నిష్క్రమించును.]

సావి — [దైన్యముతో] [స్వ] ఆహా! విధి యీయనకు దయ యను మాటనైనఁ గలుగనీయకుండెనే? నాభర్త నీయక మహామేరు వొసంగినను నాకు సంతోషముండునా? ఇంకేమి చేయుదును?

యము — [సంతోషముతో] [స్వ] ఆహా! స్త్రీలెంతటి ధన్యురాండ్రు! వేదాదుల నభ్యసింపకున్నను, యాగాదుల నొనరింపకున్నను, దపంబుల నాచరింపకున్నను ఒక్కపతిభక్తిగలిగి ప్రవర్తించిన సకలకార్యసిద్ధి వడయుచుందురుగదా! [ప్ర] అమ్మా! సావిత్రీ! అనన్యసామాన్య మగు నీ మనోనిశ్చలత్వము వర్ణనాతీతముగ నున్నది. ఇంక నీ మనోభీష్టము నెఱింగింపుము.

సావి —

మ॥ అనఘా, భర్తృవియోగదుఃఖమును శక్యంబే సహింపంగఁ; బా
వనకార్యంబుల భర్తృహీనలను బిల్వం జూతురే; కీర్తివ
ర్ధనునిన్, సద్గుణరాశి, సాళ్వసుతు, మత్ప్రాణేశ్వరుం బ్రాప్తజీ
వనునిం జేయవె; ప్రేమసూపవె; మహాపన్నన్ ననున్ బ్రోవవే!

యము—ఓ పతివ్రతా! నీ యభీష్టము తప్పక నెఱవేఱును; సంశ యింపకుము. సాధుచరిత్రుం డగుటవలన నీ భర్తకుఁగూడ వరము లిచ్చెద.

సావి—మహాప్రసాదము.

యము—

చ॥ ఇతఁడు చతుశ్శతాబ్దము లంహీనపరాక్రమవిక్రమంబులన్
క్షితితల మెల్ల నేలు; నృపశేఖరుఁడై సురలెల్ల మెచ్చఁగాఁ
గ్రతువులొనర్చుఁ బెక్కు; కులగౌరవమెంతయువృద్ధిసేయు; స
త్సుతులను గాంచు నూఱ్వుర; యశోధనవర్ధనుఁడౌను కోమలీ!

కల్యాణీ! కడుదూరము నడచితివి. ఇంకఁ బ్రయాణ పడ నేరవు. పద్మక మనువిమాన మొసంగెద. దాని నధిష్ఠించి వైళంబ నీ పతికడ కేగుము.

సావి—మహాప్రసాదము. ఇంక నాకు ముదల యిండు.

యము—శుభం భవతు. [అని యముఁడు నిష్క్రమించును.]

సావి—ఆహా! ఇప్పటికిఁ గదా, నేను ధన్యురాల నైతిని. పతిశుశ్రూషా విశేషము, సావిత్రీదేవి వాత్సల్యాతిశయము, సజ్జన దర్శన ప్రభావము నాకు సమగ్రఫలము లొసంగినవి.

[తెరలో] విమానరాజమా! ఇందే నిలువుము.

భటు—[ప్రవేశించి] తల్లీ! విమానము సిద్ధమైనది. మిమ్ముఁ జూడ అంతఃపురాంగన లభిలషించుచు నిట వచ్చుచున్నారు.

సావి—ఇదే వచ్చుచున్నాను. [స్వ] ఇఁక వైళంబ చని నా ప్రియ భర్త నిప్పుడే చూడఁగలను.

[అని సావిత్రి భటునితో నిష్క్రమించును.]

ఇ ది ష ష్ఠాం క ము.

---



# సావిత్రీ నాటకము

## సప్తమాంకము.

[వనప్రాంతమున శైబ్యాద్యుమత్సేనులు, శారద్వత వీరచరితులు, మునులు ప్రవేశింతురు.]

ద్యుమ—[విచారముతో] మునిపుత్త్రులారా! సావిత్రీ సత్యవంతు లెందును గానిపింపరైరే! ఇం కేమి చేయుదము! పరమేశ్వరా! ఎప్పుడో పోయి యనేకచికిత్సలు చేసి చేసి విసికిన మాకుఁ గన్ను లొసంగి పుత్త్రవియోగమును సమకూర్చితివా?

ఉ॥ కన్నులు లేనిలోపమును • గానఁగనీయ కొకింతయేని, మ
మ్మన్నివిధంబులం దనువు•నట్టి కుమారునిఁ గోడలిన్ మహా
పన్నత నొందఁజేసి, మును • వాసినదృష్టి లభింపఁజేసి, తీ
కన్నుల నేమిచూచుకొని•కాంచఁగలారము మోదమోహరీ!

శైబి—అయ్యో! దైవమా! చివర కెట్టి యిక్కట్టు లనుభవింపఁ జేయుచుంటివి? హా! కుమారా! సత్యవంతా! రాజ్యసర్వస్వముం గోలుపోయినను నీవే మ మ్ముద్ధరింతు వని నిన్ను నమ్మి నీ యభివృద్ధిఁ గోరెడి యీ వృద్ధుల నెవ్వరు రక్షింతురు? అమ్మా! సావిత్రీ! వివాహమైనది మొదలు సర్వోపచారములు చేయుచు మ మ్మన్నివిధములఁ గుమారునిఁగూడ మఱపించిన సాధుచరిత్రవే? నీ కైన నీ చీకులమీఁద దయలేకపోయెనా? చిత్రాశ్వా! భార్యతోఁ గూడ నెట్టి యిక్కట్టు లనుభవించుచుంటివో? ఎంత చింతిల్లుచుంటివో? మాకొఱ కెంత దుఃఖించుచుంటివో? చిత్రాశ్వా! నీ క్షేమము నెవ్వరు తెలియఁజేయుదురు? ఋషివర్య

యావత్సముద్రమునుండి యెవ్వరు గడతేర్తురు? పుత్త్రీ!
బ్రదికియుండియు నీ దురవస్థను దెలియలేకపోతిమి కదా!
చ॥ కడుపునఁ బడ్డదాది యధిక శ్రమలం బడి, కాంచి, కన్నులం
దిడుకొని పెంచి, నీసుఖము నెప్పుడు నెమ్మదిఁ గోరుకొంచు నీ
పుడమి సమస్త మేలు దని పొంగుచునుంటిమికాని, యీవిధిన్
బడఁతియు నీవు కాఁడడవిపాలగుటన్ గణియింపఁ బుత్త్రికా!
శార—రాజదంపతులారా! శాంతింపుఁడు, శాంతింపుఁడు. ఇందే యుండి
యుందురు. [ముందు చూచి] ఇదిగో, సత్యవంతుఁడు; సత్య
వంతుఁడు!!
శైబి— } నాయనా! ఎక్కడ, ఎక్కడ? [అని సమీపింతురు] తండ్రీ!
ద్యుమ— } చిత్రాశ్వా! చిత్రాశ్వా! [అని పిలుతురు.]
శైబి—ఏమి! ఈచిత్రము ఎప్పుఁడు ఇంతసదు మెఱుఁగఁడే! [శరీరము
పట్టిచూచి] ఏ మిది శరీర మిట్లున్నది? నిద్రియే మైయుండునా?
ద్యుమ—సావిత్రి యెక్కడ? [పరికించి] ఎందును గాన్పింపదే? వీర
వ్రతుఁడా! మా సావిత్రినిఁ జూడుమా!
వీర—[వెదకుట నభినయించును.]
ద్యుమ—చిత్రాశ్వా! చిత్రాశ్వా! పలుక వేమి తండ్రీ! దేవీ! ఇది
నిద్దురగాదు. పెద్దనిద్దురయే. [అని దుఃఖించును.]
శార—రాజదంపతులారా! దుఃఖింపకుఁడు.
ద్యుమ—దుఃఖము గాకే మున్నది? తండ్రీ!
శైబి—నాయనా! సత్యవంతా! తలిదండ్రులను మఱచిపోతివా? ఈ
ముదుసళ్ళను బుత్త్రవియోగాగ్నిపాలు చేసితివా?
సత్య—[అవయవములఁ గదల్చును.]
శార—రాజదంపతులారా! విచారింపకుఁడు, సత్యవంతుఁడు శరీర
మును గదల్చుచున్నాఁడు.
వృద్ధులు—అంతటి యదృష్టమా!
సత్య—[కదలును.]
ద్యుమ—దుఃఖింపకుము. దేవీ, అవయవములు కదలుచున్నవి. చెమట
పోయుచున్నది. [అని యుభయులు విసరుచుందురు.]

శైబి—నాథా! సావిత్రిజాడ తెలియక పోయెనే. ఎందుండెనో కదా! మదేశ్వరుఁ డీ వార్త విన్న సహింపఁగలుగునా?

[తెరలో]

అశ్వపతి—దేవా! ఇదియే యాశ్రమప్రాంతము. ఇటుదయచేయుఁడు.

ద్యుమ—అశ్వపతిమహారాజుమాటవలె నున్నదే! సావిత్రీవృత్తాంత మడిగిన నేమి చెప్పఁగలము?

[అంత మాళవి, అశ్వపతి, నారదుఁడు ప్రవేశింతురు.]

శైబి, ద్యుమ—మునిచంద్రమా! నమస్కారము మమ్ముద్ధరింపుఁడు. మా సావిత్రీవృత్తాంతము నెఱింగింపుఁడు. [అని దుఃఖింతురు.]

నార—రాజదంపతులారా! విచారింపకుఁడు. సత్యవాతుఁడు సుఖముగ లేవఁగలఁడు. సావిత్రి యనాయాసముగ రాఁగలదు.

వృద్ధులు—మహాత్మా! యిప్పటికిఁ బ్రతికితిమి.

[తెరలో—ధ్వని యగును. అందఱు వినుట నభినయింతురు.]

[తెరలో—విమానరాజమా! ఇటు, ఇటు.]

[మణిభూషణభూషితయై సావిత్రి విమానమునుండి కనఁబడుచుండును.]

అందఱు—[ఆశ్చర్యము నభినయింతురు.]

అశ్వ—ఏమి! యీ విమానరామణీయకము!

మాళ—అం దెవ్వరో దివ్యాంగన వచ్చుచున్నట్లుదే!

శార—మాహేశ్వరియా? లక్ష్మీసరస్వతులలో నొక్కరై యుందురా?

ద్యుమ—ఏమి యీ చిత్రము! ఆ విమాన మిక్కడికే వచ్చుచున్నది.

నార—ఆ వచ్చునదియే మన సావిత్రి.

అందఱు—[ఆశ్చర్యముతో] ఏ మేమి? మన సావిత్రియే? ఏమి యీ యద్భుతము!

అశ్వ—ఆ దివ్యవిమాన మెక్కడిది? ఆ యాభరణము లెవ్వ రిచ్చిరి?

నార—ఆమె పాతివ్రత్యప్రభావమే.

మాళ, అశ్వ, శైబి, ద్యుమ,—ఆహా! ధన్యులము—ధన్యులము!

సావి—[విమానమునుండి దిగివచ్చి] ముసిచంద్రిమా! నమస్కారము. అత్తమామలారా! తల్లిదండ్రులారా! అభివాదము.

అశ్వ—అమ్మా! ఎక్కడ కేగితివి? ఈ విమాన మెక్కడిది! దివ్యాంబరాభరణము లెచ్చటివి? ఎవ రొసంగిరి?

సావి—సర్వము విన్నవించుకొనియెద. [సత్యవంతుని సమీపించి] నాథా! నాథా! [అని పిలుచుచుఁ బాదము లొత్తుచుండును.]

సత్య—[కన్నులు నలుపుకొనుచు] ప్రాణేశ్వరీ! ప్రాణేశ్వరీ! [అని పిలుచును.]

సావి—ఆర్యపుత్త్రా! ఇందే యున్నదానను.

సత్య—[చూచి ఆశ్చర్యముతో] ఎవ్వర వీవు?

సావి—నాథా! మీచరణదాసిని, సావిత్రిని.

సత్య—[సంశయముతో] ఆ, ఆ! మద్రరాజపుత్త్రివా, మాసావిత్రివా? కాదు, కాదు. నిజము చెప్పి నన్ను ముట్టుకొనుము.

సావి—[స్వ] ఆర్యపుత్త్రుఁ డన్యథా తలంచుచున్నాఁడు. [సిగ్గు నభినయించును.]

ద్యుమ—కుమారా! సంశయింపకుము. ఈమె నీయర్ధాంగి సావిత్రియే.

సత్య—[చూచి] తండ్రిగారా? [పరికించి ఆశ్చర్యముతో] ఇదియేమి? మిత్రులు, జననియు, అత్తమామలు, దేవముని నారదఋషిందుడ్రుఁడా? పూజ్యులారా, నమస్కారము.

అందఱు—శుభం భవతు.

సత్య—ఎల్లరు న న్ననుగ్రహించుచుంటిరే. ఏమి నా భాగ్యము! అమ్మా కోడ లెక్కడ?

శైబి—తండ్రీ, మన భాగ్యదేవత యీమెయే.

సత్య—నిజముగా,నా? ఎచ్చటి దీ యలంకారము? కన్నుల మిఱుమిట్లు గొల్పుచున్నదే. ప్రాణేశ్వరీ, ఈ మణిభూషణము లెచ్చటివి? ఈ విచిత్రాంబర మెట్లు వచ్చె?

సావి—మీదాస్యవిశేషముననే.

సత్య—ఇది మిగుల వింతగ నున్నదే! ప్రేయసీ! ఆ సమయంబున నిద్రవోయిన నన్నేల మేలుకొలుపక పోయితి? సుందరీ! దీర్ఘకాయుఁడై బలవంతుఁడైన పురుషుఁ డెవ్వఁడో యొకఁడు నన్ను పాశబద్ధునిఁజేసి భయంకర ప్రదేశములకుఁ గొనిపోయినట్లు కలఁగంటిని. అదియేమైయుండునో యూహింపఁజాలనైతిని.

సావి—నాథా! అది స్వప్నము కాదు. ఆ వృత్తాంతమంతయుఁ జెప్పెద నాలకింపుఁడు.

నార—అమ్మా! సవిస్తరముగఁ జెప్పుము.

సావి—పూజ్యులారా! హృదయేశ్వరునకు నేఁ డెద్దియో యాపద రావచ్చు నని తొల్లి యీ దేవమునివలన వినియుండుటచేఁ ద్రిరాత్రోపవాస మొనర్చి, సావిత్రీదేవి నర్చించి, భర్తతో నడవికి వచ్చితిని. పిమ్మట శిరోవేదనచే నాథుఁ డొడలు తెలియక పడియుండ యముఁ డరుదెంచి పతిప్రాణములఁ దీసికొని యేగుచుండె.

సత్య—[ఆశ్చర్యముతో] ఏ మేమి?

సావి—పిమ్మట నే నొకింతధైర్య మవలంబించి మహాటవులందఁబడి యమునితో వెడలితి దండధరుండు కరుణాంతరంగుండై నాకు రెండు వరము లిచ్చె.

ద్యుమ—అమ్మా! దివ్యపురుషసందర్శన మొనరించిన నీ మహిమ నెంత యని కొనియాడుదుము!

అశ్వ—తల్లీ! ఆరెండువరము లెయ్యవి?

సావి—నా యత్తమామలకు నేత్రలాభము, రాజ్యప్రాప్తి.

శైబి—తల్లీ! అత్తమామలపై నీకుఁ గలభక్తి నెంతయని కొనియాడుదుము. తరువాత?

సావి—మఱికొంతదూర మేగ నయ్యముండు నా జననీజనకులకు నూర్గురు కొడుకులు కలుగునట్లు వేరొక వరమును, బిమ్మట నేను యమలోకమున కేగ, నానాథుండు జీవించునట్లు కొండొక

వరమును, నాప్రియభర్త సత్యనిష్ఠకు మెచ్చి నాలుగువందల సంవత్సరములు న్యాయముగ రాజ్యపాలనం బొనర్చునట్లును, నూర్గురు పుత్త్రులు కలుగునట్లును వేఱొక వరమును, దయచేసి యీపద్మకవిమాన మొసఁగి భర్తకడ కేఁగుమని యాజ్ఞయిచ్చె. శ్యామాదేవి మున్నగు నంతఃపురాంగనలు వస్త్రభూషణాదుల నొసంగిరి. ఇప్పటికి మీ యందఱ నిందే చూడఁగలిగితి.

అందఱు—ఆహా! ఈమెసామర్థ్య మత్యద్భుతముగ నున్నది కదా!

[తెరలో] అయ్యా! ద్యుమత్సేనమహారా జెందున్నవాఁడు? ఇందేయుండె ననుచుంటిరా?

అందఱు—[వినుట నభినయింతురు.]

ద్యుమ—ఎక్కడి దీ కంఠధ్వని? ఎప్పుడో వినిన ట్లున్నదే?

మతిమంతుడు—[ప్రవేశించి] ద్యుమత్సేనమహారాజా, నమస్కారము.

ద్యుమ—మంత్రివర్యా, మతిమంతా! ఎంతకాలమునకు నిన్నుఁ జూడఁ గల్గితిని! నాయనా! ఇటు రమ్మ. సేమముగ నుంటివా?

మతి—మీయనుగ్రహ విశేషమున క్షేమముగనే యుంటిని.

ద్యుమ—నీ యాగమనమునకుఁ గారణము?

మతి—దేవా! తమ కపకారమొనరించిన యుగ్రసేనహతకుఁడు దుర్మదాంధుఁడై ప్రజలను బాధించుటవలన మంత్రి సామంతులును, నిఖిల సేనాపతులును, పౌరజానపదులును ప్రభువును దిరస్కరించి యాతనిని, సపుత్త్రికముగ బంధించి చెఱసాలయం దుంచి భవదాగమనమునకై నిరీక్షించుచున్నారు. కుమార సహితముగ దయచేయఁ బ్రార్థించుచున్నాఁడను. సపరివారముగ రథము లిందే సిద్ధముగ నున్నవి.

ద్యుమ—రాజుల రాజ్యచ్యుతికిఁ బ్రజాద్వేషమే కదా, ముఖ్యకారణము. ఇప్పుడే రాఁగలము. కుమారా, అశ్వపతిమహారాజా, మునికుంజరులారా! ఇంక మన పురమునకుఁ బోవలయును,

తల్లీ! సావిత్రి! ఇది యంతయు నీ సామర్థ్యవిశేషమే గదా! నీశక్తి నెంతయని కొనియాడుదును?

చ॥ వినవిన నీ చరిత్ర మతి • విస్మయమున్ గలిగించె; యోగ్యవ
ర్తనమున, సత్తపోమహిమ, • ధర్మరతిం, బతిభక్తి దేవతా
వనితలె నిన్నుఁ బోల రస, • వార్థిపరీతధరిత్రిలోన నీ
కెన యెవరమ్మ? నీమహిమ • నెన్నఁగశక్యమటమ్మ! మానినీ!

అశ్వ—అమ్మా! సావిత్రీ!

శా॥ పాతివ్రత్యము నెంతనమ్మితివొ, త్వం • త్ప్రాణేశుఁ డల్పాయు వీ
రీతిన్ బాధల నొందునం చని ముని • శ్రేష్ఠుండు వాక్రుచ్చినన్
గాతర్యం బినుమంతయుం గొనక, యీ • తన్మాపాలు కేల్వట్టి, వి
ఖ్యాతింగైకొని, యుద్ధరించితిగద • మ్మా! మమ్ము మావంశమున్.

సత్య—ప్రేయసీ! నీశక్తి నెంత యని మెచ్చుకొందును!

సీ॥ తులసీవనుల కేగ • నలఁతఁజెందెడు నీవు
ఘనవనాగము లెట్లు • గడచినావు?
దరి నున్న కెలఁకుల • కరుగ వెఱచు నీవు
తత వైతరణి నెట్లు • దాఁటినావు?
పసిలేళ్ళ పరుగుల • భయము నందెడి నీవు
కాలుకృత్యము లెటుల్ • గాంచినావు?
బంధులతో నైనఁ • బలుక శంకిలు నీవు
యము నెట్లు వరముల • నడిగినావు?
వేదశాస్త్రోక్తసద్వధూ • విధివిధాన
వినుత సౌశీల్య తోషిత • ప్రేతనాథ
లబ్ధ పతిజీవ! సంస్తుత్య! • లలన! నీవు
పత్నివగు నాదు భాగ్యంబు • పలుకవశమె?

శార—తల్లీ, సావిత్రీ! ఏ యోగివరప్రభావము, ఏమునిజనతపో మహిమము, నీ పాతివ్రత్యమహిమకు సాటిరాఁగలవు?

సీ॥ గతచక్షువగు సాళ్వ • పతిదృష్టి కమృతంపు
గుళికయై యొప్పె నే • కొమ్మమహిమ
తమరాజ్య మలమిన • విమతాటవులఁ గాల్ప
దావమై తనరె నే • తరుణిమహిమ
పుత్త్రహీనులకు సు • పుత్త్రుల నొడఁగూర్పఁ
బరశక్తి యయ్యె నే • పడతిమహిమ
విగతజీవుం డైన • విభుని రక్షింపంగ
సంజీవి యయ్యె నే • సాధ్విమహిమ
అట్టి యద్భుత మహిమల • నలరి సతుల
కెలమిఁ బతిభక్తిమహిమంబుఁ • దెలియఁజేసి
వినుతిఁ గాంచుచునున్న సా • విత్రిచరిత
తనరుత ధరిత్రి నాచంద్ర • తారకముగ.

నార—సావిత్రీ సత్యవంతులారా! మీ యభీష్ట మెద్దియైనఁ గోరు కొనుఁడు.

సావి-సత్య—దేవా! మీయనుగ్రహ విశేషమున సర్వము సమకూరినది. అయిన నిట్లగుఁగాక!

సావి—గీ॥ సతము పతిభక్తినిరతలై • సతులు; చిరత
సత్య— రాయురారోగ్య విభవులై • యఖిల జనులు;
సావి— సకల సస్యపరిపూర్ణమై • క్ష్మాతలంబు;
సత్య— వెలయుఁగావుత మంగళం • బొలయుఁగాత!
నార— తథాస్తు.

[అందఱు నిష్క్రమింతురు.]

సప్తమాంకము సమాప్తము.

శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి ప్రణీతం
బైన సావిత్రీ నాటకము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

(రంగూన్ రౌడీ అనంతర

(గ్రంథకర్త—నూరి పార్థసారథిశర్మగా

పాఠక మహాశయులు—"రౌడీల కెల్ల రౌడీ" యైన మా
రావు భయంకరచరిత్రమును ఇదివఱకు వినియే యున్నారు. భ
అతఁడు దేహత్యాగము గావించిన యనంతరమున, తక్కుటుంబ
రావు కుమారుఁడగు మోహనరావునకు, నూరువాడీచేఁజిక్కిన
చెనుగదా! అతని జీవిత మెట్లుగడచినది?" అని అనేకులు మాకువ్రా
ననే ఈ "రంగూన్ మెయిల్" నాటకమును మే మిప్పుడు ప్రచ

తండ్రి చచ్చినతరువాత ప్రబోధనముతో కాకినాడ
'నేషనల్ బ్యాంకు'కు మోహనరావు డైరెక్ట రయ్యెను. "అంతటి
కాకినాడల నడుమ తెలుగుకూలీలు విశేషముగా ప్రయాణము చ
విశేషలాభ ముండునని మోహనరావు బ్యాంకిధనమును ఏబదివే
"రంగూన్ మెయిల్" అను స్టీమరును స్థాపించెను. నాటకారంభ
మెయిలు సముద్రమున గొట్టుకొనిపోయె ననుభయంకరవార్త కర్ణ
రావు చెవిని బడును. రౌడీకథయందు గంగారామునకు- కాదు
భార్య యైన నాందీబాయికి పుట్టిన బాలుడు "రాజారాం" అ
వేంకటరావు యను మఱియొక దుర్మార్గునితో కలసి మోహనరా
వేయించి, అతనిని మధుపాన వేశ్యాసంగమవ్యసనములయందు దిం
ముచేసెనో మోహనరావు తన కుమారునిచంపుకొని, యెట్లు కౌ
వించెనో-దుర్మార్గులగు వేంకటాద్రిరావు రాజారాముల కెట్లు పాపఫ
"రంగూన్ మెయిలు" తుద కెట్లు క్షేమముగా వచ్చి సర్వజనాన
రంగూన్ మెయిలు నాటకమున గాంచి యానందింపఁగల
రంగూన్ మెయిలు కథలలో- ఏది రమ్యమైనదో నిర్ణయింప పా

వెల రు 1-

వలయువారు:—

కురుకూరి సుబ్బారావు అండ్